# నీతి తెరలు

[నాటకం]

రచన:

శ్రీ అంగర సూర్యారావు




చౌదరి పబ్లికేషన్సు

మండపేట :: తూర్పుగోదావరి జిల్లా

తొదరి ప్రచురణ :
తొ లి కూ ర్పు
1959

ము ద్ర ణ :
శ్రీ భారతీ ప్రింటింగు ప్రెస్,
ఆలమూరు.

వె ల :
రు. 1—50

సంపాదకుడు
యం. యస్. చౌదరి.

కృ త జ్ఞ త

"ఆంధ్ర సచిత్ర వార పత్రిక" సంపాదకులకు

ర చ యి త

ఆంధ్ర విశ్వ విద్యాలయం (వాల్తేరు)లో 20-12-1956 తేదీని

మిసెస్. ఎ. వి. యన్ కాలేజీ విద్యార్థులు ప్రదర్శించి

నప్పటి నటవర్గం

దినకర్:— శ్రీ లక్ష్మీపతిరాజు

కిశోర్:— శ్రీ కృష్ణారావు

నిరంజన్:— శ్రీ గుప్త

ఆనంద్:— శ్రీ పార్థసారథి

జయరాం:— శ్రీ సత్యనారాయణ

దండపాణి:— శ్రీ శ్రీరామమూర్తి

దామోదరం:—శ్రీ నారాయణరావు

వామనమూర్తి: శ్రీ నరశింహారావు

చిత్రి:— శ్రీ రామారావు

సంగీతం:— శ్రీ ప్రతాప్

దర్శకత్వం:— శ్రీ టి. జి. కె. గుప్త

పర్యవేక్షణ:— శ్రీ బి. బి. కృష్ణమూర్తి యం. ఎ.,

•

# వి జ య వా డ లో

## ది 11-12-1957 తేదీని ప్రదర్శించినప్పటి

## న ట వ ర్గ ం

దినకర్ : శ్రీ ఎ. బి, సాంబశివరావు

కిశోర్ : శ్రీ సి. హెచ్. కబీరుదాసు

నిరంజన్ : శ్రీ కె. నారాయణరావు

ఆనంద్ : శ్రీ వి. యల్. జగపతిరాజు

జయరాం : శ్రీ టి. వెంకటపతిరాజు

దండపాణి : శ్రీ బి. లూథర్

దామోదరం : శ్రీ డి. సూర్యనారాయణ

వామనమూర్తి : శ్రీ సి హెచ్. వి. సత్యమూర్తి

చిత్ర : శ్రీమతి సావిత్రి

దర్శకులు : శ్రీ సి హెచ్. కబీరుదాసు

పర్యవేక్షణ
సంగీతం } శ్రీ జి. యస్. ఆర్. మూర్తి

నిర్వహణ : ఆంధ్రా సిమెంటు కంపెనీ యంప్లాయీస్ యూనియన్ కల్చరల్ వింగ్.

# పాత్రలు

దినకర్

కిషోర్

నిరంజన్

ఆనంద్

జయరాం

దండపాణి

దామోదరం

వామనమూర్తి

చిత్రి (స్త్రీ)

# నీలి తెరలు

[ ఒకటవ అంకం ]

[స్థలం:- విశ్రాంతి భవనంలో ఒక హాలు.

సమయం:- ఉదయం 7 గంటలు.

హాలులో ఒకవైపు ఒకసోఫా, మరోవైపు రెండు కుర్చీలు వున్నాయి. మధ్య ఒక టేబిలు వుంది. హాలులోనుంచి మేడమీదికి వెళ్ళడానికి మెట్లు కన్పిస్తున్నై. దినకర్ సోఫాలో కూర్చుని తన్మయుడై ఏదో రాసుకుంటున్నాడు. రాస్తూ మధ్యలో ఆగి తిరిగి చదువుకుంటున్నాడు.]

దినకర్: (చదువుతూ) ప్రపంచం ఒక రంగస్థలం. ఓ మనిషీ, నీ పాత్రను బాగా అర్థంచేసుకొని నటించు. అపుడే నీవు ఉత్తమనటుడవవుతావు. రంగస్థలంనుండి నీవు నిష్క్రమించక

తప్పదు. ఉన్న కొద్దిక్షణాలలోను నీ పాత్రను ప్రాశస్త్యవంతంగా నిర్వహించి కీర్తిని సంపాదించుకో.

[కుడివైపునుంచి ఆనంద్ వస్తాడు. పొట్టిగా వున్నాడు. మాసిపోయిన బుష్‌కోటు, ఫాల్డింగులదగ్గర చిరిగిపోయిన ఫుల్ పాంటు వేసుకున్నాడు. భుజాన్ని హోల్డాలు వుంది. దినకర్ ఒకసారి ఆనంద్ కేసి చూసి తిరిగి రాసుకుంటున్నాడు.]

ఆనంద్: (హోల్డాలు దించి దినకర్ కేసి తిరిగి చేతులు జోడించి) అయ్యా! నమస్కారం!

దిన: (అతని కేసి నిర్లక్ష్యంగా చూసి) కృత్రిమ తెరలను తొలగించి చూస్తే నువ్వూ నేనూ ఒకటే- నమస్కరించేవాడు, నమస్కరించబడేవాడు యీ ప్రపంచంలో వుండకూడదు.

ఆనంద్: అయితే తమరెవరు?

దిన: నేనా? నేనీ మహానాటకానికి సూత్రధారుణ్ణి. మరి నీవెవరవు?

ఆనంద్: మీరీనాటకానికి సూత్రధారులయితే నేను పాత్రధారుణ్ని.

దిన: నీది ఉదాత్తమైన నాయకపాత్రా?

ఆనంద్: కాదు.

దిన: వంచకుని పాత్రా?

ఆనంద్: కాదు.

దిన: అయితే నీది శుద్ధ హాస్యపాత్రమై తీరాలి.

ఆనంద్: ( సంతోషంతో ) అద్భుతంగా కనిపెట్టారు. నేను ప్రఖ్యాత హాస్యనటుణ్ణి.

దిన: సమయం సందర్భం లేకుండా నువ్విలా రంగభూమిమీదికి రావడానికి కారణం ?

ఆనంద్: ఉదర నిమిత్తం.

దిన: దారిద్ర్యం కళకు మెరుగు పెడుతుంది. కళను నాశనంచేసే శక్తి దానికి లేదు. కడుపునిండితే కళాకారుడు హాయిగా కళ్ళు మూసుకు నిద్రపోతాడు. అతనిలోని కళా నిద్ర పోతుంది.

ఆనంద్: అయితే అతగాడు అర్ధాకలితో మాడి చావాలనా తమ అభిప్రాయం ?

దిన: నూటికి నూరుపాళ్ళు అదే నా అభిప్రాయం—ఉదాహరణకు నన్ను చూడు. రోజుకు ఒకపూటమాత్రం భోజనం చేస్తాను. ఈ విశ్రాంతిభవనానికి ఉత్తరపు కొసగది నా బస. నా గదిని ఆనుకొని మునిసిపాలిటీవారి మురికికాలవ ఒకటి వుంది. రాత్రింబవళ్ళు నా గదిలో దోమలు విశృంఖల విహారం చేస్తూ వుంటాయి. కళ్ళు మూతలు పడే రాత్రిసమయంలో అవి నాకు మేలుకొలుపులు పాడతాయి. వెను వెంటనే కలం తీస్తాను— అర్ధాకలి, మురికికాలవ, దోమలు

లేకపోతే నేను ఉన్నిఉత్తమకావ్యాలు రాయగలిగేవాడినా?

ఆనంద్: ఓహో! తమరు కవులన్నమాట! ఓ కవిరాజా! మీ పరిచయం కలిగినందుకు చాలా ఆనందిస్తున్నాను.

దిన: రాజులూ పోయారు: రాజ్యాలూ పోయినవి. సామ్రాజ్య శిథిలావశేషాలలా కవిరాజులు, కవిసమ్రాట్టులూ యింకా నిలిచివున్నారు. నాయనా, నేను కవిరాజును కాను. కేవలం సామాన్య భావకవిని. నన్ను అహంభావకవి అన్నా నాకేమీ అభ్యంతరం లేదు.

ఆనంద్: (విచారంగా) రాజ్యాలు పోయి నందువల్లనే మా బ్రతుకు ఇలా రచ్చకెక్కింది.

దిన: (ఆశ్చర్యంతో) అరే భాయీ! ఇధర్ దేఖో! రాజ్యాలు పోయినందుకు ఏడ్చేవాడవు నీ వొకడవు వున్నావన్నమాట.

ఆనంద్: నేనొక్కడినేకాదు మహానుభావా! నాలాంటివాళ్ళు వేలకొద్దీ వున్నారు. మా రాజాగారు దివాళా తీశారు; మా నాటక కంపెనీ దివాళా తీసింది. దానితో మేం చెట్టుకొకరం, పుట్టకొకరం చెదరిపోయాం.

దిన: విచారించకు. రోజులు మారుతున్నాయి. మరో ప్రపంచం వస్తోంది. కళ ప్రజలకోసమనే వాదం గెలిచింది. ప్రజలే కళలను పోషిస్తారు. ఆనాడే నీకళ చిరస్థాయిగా నిలుస్తుంది.

ఆనంద్: మీ మాటలు నాలో ఆశలను చిగురింప చేస్తున్నాయ్.

ఆనందాన్ని కలిగిస్తునాయ్.

దిన: నువ్వు ప్రతి చిన్నవిషయానికి ఆనందిస్తున్నావు. కనక నీ పేరు 'ఆనందం' అయితీరాలి.

ఆనంద్: (ఆనందంతో) అత్యద్భుతంగా కనిపెట్టేశారు. నాపేరు సరిగా అదే! తమది ఎంత కుశాగ్రబుద్ధి! ఇంత తెలివిగల మీరు ఒక మంచి నాటకం ఎందుకు రాయకూడదూ ?

దిన: సిరా వున్న కలం, సిగరెట్టుపెట్టె, అరకప్ కాఫీ, అరదస్తా కాగితాలు యిచ్చి చూడు. ఈ కవితాసామగ్రి లేనిదే ఎలా రాయగలను భాయీ ?

ఆనంద్: సెహభాష్! చాలా బాగా చెప్పారు. వెనకటి కోకవి సిగరెట్టు యిస్తే శతకం చెబుతానన్నాడు. సరే దానికేం. అసలు విషయంలోకి వద్దాం. ఈ విశ్రాంతి భవనానికి ప్రొప్రయిటరుగారు ఎవరు?

దిన: వామనమూర్తిగారు.

ఆనంద్: ఆయన ఎటువంటివారు?

దిన: పరకాంత లెదురైన తల వంచుకు పోవునతడు. కీర్తికాం తను గుచ్చి కౌగలించుకొనును.

ఆనంద్: కీర్తిప్రియు డయితే మరీ మంచిది. నేను మరో నాలుగు రోజులు తిష్ఠ వెయ్యవచ్చును.

దిన: చూడు భాయీ! నా మహాకావ్యం మధ్యలో ఆగిపోయి

వ్రారుకోంది. ఒక సిగరెట్టు వుంటే యిలా పారెయ్.

ఆనంద్: (దినకర్‌కు దగ్గరగా కుర్చీ లాగి కూర్చుని) ఈ వూరు నే నెప్పుడూ చూడలేదు. [జేబులోంచి సిగరెట్టు పెట్టె తీస్తాడు. యిద్దరూ చెరో సిగరెట్ వెలిగిస్తారు.]

దిన: [సిగరెట్ గట్టిగా పీల్చి] చూడకపోయినందువల్ల నష్టం యేమీలేదు.

ఆనంద్: మా నాటకం కంపెనీ దివ్యంగా వెలుగుతున్న రోజు లలో నిరంజన్ అనే యువకు డొకడు మా చుట్టూ తిరుగుతూ వుండేవాడు. అతని వేషభాషలనుబట్టి ధనవంతుడని గ్రహించాం. మా నాటకమండలి రద్దవడం అతను కళ్ళారా చూశాడు. అతను నన్ను తనవూరికి రమ్మని ఆహ్వానించాడు. అందుకోసం యిప్పుడు వచ్చాను.

దిన: అతను నిన్ను ఆహ్వానించడానికి కారణం!

ఆనంద్: కొంతమంది నటులను చేరదీసి ఒక నాటకమండలి స్థాపించడంకోసం.

దిన: ఇంకా ప్రారంభదశలోనే వుంది వ్యవహారం.

ఆనంద్: ఈవూరు గురించి నాకేమీ తెలీదు, ఈ వూళ్ళో నివసించే ప్రజలు ఎటువంటివారు? కళలను ఆదరించి గౌరవిస్తారా?

న: మావూరిని నీకు పరిచయం చెయ్యనా? మా పురవాసు

తెలా వుంటాదో చెప్పనా? అదిగో! కనిపిస్తోంది. అదే మా వూరు, ధనవంతులు, సామాన్యులు, నిరుపేదలు, వర్తకులు నర్తకులు, దళారులు, కళాకారులు, కవులు, గాయకులు, జారులు, చోరులు, దగాఖోరులు— అపారవారా వారం లాంటి మావూళ్ళో అందరూ వున్నారు.

ఆనంద్: (సంతోషంతో) ఓహో! యీపురం అన్నివిధాలా మాకు నివాసయోగ్యంగా కనిపిస్తోంది.

దిన: ఇపుడిపుడే చీకటితెరలను తొలగించాడు సూర్యుడు. వెలుగులోకి వస్తున్నారు కొందరు. వెలుగును చూడలేక చీకటి గదులలోకి తిరోగమిస్తున్నారు కొందరు— రాజవీధి కళకళలాడుతోంది. అచట తిండి, వస్త్రం, విజ్ఞానం వినోదం, సుఖం, శాంతి, సుందరాంగి వలపు అన్నీ వెలకు దొరుకుతాయి.

ఆనంద్: [నవ్వుతూ] హా! హా! కాళిదాసుగారి గంధర్వనగరం కంటే మీ పురమే బాగుంది.

[ఎడమవైపునుంచి దండపాణి వస్తాడు. లావుగా, పొడవుగా వుంటాడు. ముఖంలో అజ్ఞానం కనిపిస్తూ వుంటుంది.]

దండపాణి: ఏమండోయ్ సార్! ఇక్కడ మీరు గోలాగీలా సెయ్యడానికి వీల్లేదు. కొన్ని సెణాలలో యిక్కడికి పెద్దలొస్తున్నారు.

ఆనంద్: పెద్దలనగా ఎవరు? ఊవ్రారికి పెద్దలా? రాష్ట్రానికి పెద్దలా? లేక దేశానికే పెద్దలా ?

దండ: ఓహో! బాగుందయ్యోయ్ యవ్వారం! నీతో సోదేసు కూర్చోడానికి నాకు తీరుబాటు లేదు. పెద్దలంటే పెళ్ళి పెద్దలు.

దిన: మీ ప్రొప్రయిటరుగారు తిరిగి పెళ్ళిచేసుకుంటున్నారా?

దండ; ఛ! లేదు బాబూ! అమ్మాయిగారి పెళ్ళికోసం.

చిత్ర: (నేపథ్యంలోంచి కోపస్వరంతో) దండపాణి! దండపాణీ.

దండ: (హాలు ప్రతిధ్వనించేలా బిగ్గరగా) ఇక్కడ వున్నానండి అమ్మాయిగారూ!

చిత్ర: (నేపథ్యంలోంచి) యు! ఫూల్! కమ్ హియర్!

దండ: (బిగ్గరగా)అదేంటో సరిగా నాకు తెలవలేదండి. పువ్వులు తెమ్మంటారా?

[చిత్ర మేడమెట్లు దిగి బిరబిరా వస్తుంది. ఎత్తు మడమలజోడు, జార్జెట్ చీర. పెదవులకు 'లిప్ స్టిక్' ఎరుపు, రెండు జడలు— నవనాగరికత అంతా ఆమెలో ప్రతిఫలిస్తోంది. ఆమె ముఖంలో చురుకుతనం, తెలివి కనిపిస్తాయి.]

చిత్ర: (కోపంతో) ఇండియన్సుకు 'పంక్చుయాలిటీ' తెలియదు సరిగా ఏడుగంట లయ్యేసరికి నువ్వు నా టేబిల్ మీద కాఫీ ఎందుకు పెట్టలేదు.

దండ: (భయభక్తులతో) పెళ్ళితొందరలోపడి మరిచి పోయాన మ్మాయిగారు. యిప్పుడే తెస్తాను.

(తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు.)

ఆనంద్: [దినకర్‌తో] ఇండియన్సును విమర్శిస్తోంది. అమ్మాయి యూరోపియన్ కాదుగదా?

దిన: కాదు. ఇంతవరకూ యీామె యూరోపియన్ స్కూల్లో చదువుకొంది.

చిత్ర: (ఆనంద్ కేసి ఒకసారి నిర్లక్ష్యంగా చూసి దినకర్‌తో) మిస్టర్, దినకర్! నిన్న మీరిచ్చిన తెలుగు పుస్తకం కొంత చదివాను: సరిగా బోధపడలేదు.

దిన: పద్యకావ్యంలో వున్న విశేషమే అది. చదవగానే బోధ పడిపోకూడదు.

చిత్ర: అసలు తెలుగుపుస్తకం ఒక్కసారి చదవడమే వేస్ట్ ఆఫ్ టైం! నాలుగైదుసార్లు చదవడం కూడానా! మై గాడ్!

ఆనంద్: తెలుగురాని వాళ్ళు తెలుగుపుస్తకం ఏలాగూచదవరు. ఇంగ్లీషు చదివిన తెలుగువాళ్ళు తెలుగుపుస్తకంకేసి చూడ నైనా చూడరు. అందుకే తెలుగురచయిత యీానాడు అర కప్పు కాఫీకి దిక్కులేక అలమటిస్తున్నాడు.

[దండపాణి ట్రేతో కాఫీ తీసుకొని కుడివైపునుంచి వస్తాడు.]

దండ: గమండోయ్ డింకర్ బాబుగారూ ఒక గంటసేపు మీరు నీ హోలు ఖాళీ సెయ్యాలి.

చిత్ర: నో! నో! లెట్ దెమ్ సిట్!

(అర్థంకాక దండపాణి నోరు తెరచి చూస్తాడు.)

ఆనంద్: పాపం! అర్థంకాలేదు. నేను తెలుగులో అనువాదం చేసి చెబుతాను. [చిత్రను అనుకరిస్తూ] 'వద్దు: వద్దు! వారిని కూర్చోడనివ్వు!'— అంటున్నారు.

దండ: (కోపంతో ఆనంద్ కేసి చూసి) చాలు చాల్లేవయ్యా నువ్వు చెప్పొచ్చావు. అది అయ్యగారి ఆర్డరనుకున్నావా? మరోకటేమైనా అనుకున్నావా? నీగదిలో కెళ్ళి కూర్చో.

ఆనంద్: నేనింకా గది తీసుకోలేదు.

దండ: మేనేజరుగారి దగ్గర కెళ్ళి రాయించుకో.

ఆనంద్: ఆయన ఎక్కడ వున్నాడు?

దండ: ఓహో? నీత్రో అంతా ఎకసెక్కంగా వుందే, నేవొచ్చి తీసికెళతాను. వుండు.

[దండపాణి శ్రేత్రో మేడమీదికి నిష్క్రమిస్తాడు.]

చిత్ర: దినకర్. మీరు కాఫీ తాగారా?

దిన: [పుస్తకంలోంచి తలపైకెత్తి] లేదు.

చిత్ర: ఎందుకు తాగలేదు?

ఆనంద్: కవిగారి హృదయం బరువుగాను, జేబు అతి తేలిక గాను వుండడమే కారణం.

చిత్ర: [ఆశ్చర్యంతో] కాఫీకి డబ్బులు లేనివాళ్ళు కూడా వుం టారా ?

దిన: నీకు యింకా యీ ప్రపంచంతో పరిచయం లేదమ్మా, తిండిలేక రోజులకొద్దీ పస్తులువున్న వాళ్ళు, వుండడానికి కొంప లేనివాళ్ళు, శరీరంలోని శక్తి నశించి జీవనయాత్రలో అడుగు ముందుకు వెయ్యలేనివాళ్ళు— అభాగ్యులు, అనాథులు వేలకు వేలున్నారమ్మా యీ లోకంలో.

చిత్ర: కొందరు ధనవంతులు, మరికొందరు దరిద్రులు అవడానికి కారణం ఏమిటి?

ఆనంద్: మీ పాశ్చాత్య విద్యాలయాలలో— బుర్ర బద్దలు కొట్టుకున్నా— యీ ప్రశ్నకు జవాబు దొరకదు.

(దండపాణి మేడమీదినుంచి తిరిగి వస్తాడు.)

దండ: అమ్మాయిగారూ! నాన్నగారు పిలుస్తున్నారు.

చిత్ర: మిస్టర్ దినకర్! రండి. ఈవేళ మీరు కాఫీ నాతో తీసుకోండి.

(ముందు చిత్ర వెనుక దినకర్ మేడమీదికి నిష్క్రమిస్తారు.)

ఆనంద్: (దండపాణిని సమీపించి మంచిచేసుకొనే ధోరణిలో) మిస్టర్ దండపాణీ నిన్ను యిదివరకు ఎక్కడో చూసినట్లుం దోయ్. (సిగరెట్ పెట్టెలోనుంచి ఒకసిగరెట్ తీసి) సిగరెట్ కాలుస్తావా?

దండ: (పరిసన్నుడై సిగరెట్ తీసుకొని) మెరుస్తోంది ఏం సిగ రెట్ బాబూ యిది?

ఆనంద్: (సగర్వంగా) దీన్ని కేప్‌స్టన్ అంటారులే! ఒక సిగరెట్ ఖరీదు ఒక అణా మాత్రమే!

దండ: (ఆశ్చర్యంతో) అణా ఖరీదయిన సిగరెట్ కాల్సి పారె య్యటమే! మీరు సేసే ఉద్యోగం ఏమిటి బాబూ?

ఆనంద్: నాటకాల్లో వేషాలు వెయ్యడం. డబ్బు చేతికందిన రోజున పాదుషాలా ఖర్చు పెట్టడం, డబ్బు అయిపోయినరోజు ఫకీరులా తిరగడం.

దండ: (సంతోషంతో) నాకు నాటకాలంటే శానా యిష్టం. సిన్నప్పుడు సెంచునాటకం వోళ్ళు నాకో యేసం యిచ్చారు. రాజు రంగంమీాదికి పాడతావస్తాను. ఆపాట యేదోగాని మరిసిపోయాను. నా సామిరంగా ఆ పాట యెంత మజాగా వుందనీ !

ఆనంద్: ఓహో! నీకు కూడా నాటకాలంటే యిష్టమేనా? సెహా భాష్! చెంచు నాటకంలోని పాటపాడి వినిపిస్తాను.

[పాట] రాజూ వెడలెను సభకు
రవి తేజము లలరగ
రాజూ వెడలెను సభకు!

[అభినయిస్తూ పాడతాడు]

దండ: (సంతోషంతో) అద్దదీ! అదే! అదేవరస!

ఆనంద్: మిస్టర్ దండపాణి! మేం ఈ ఊళ్ళో పెద్ద నాటక కంపెనీ ఒకటి స్థాపిస్తున్నాం.

దండ: (మొహమాటం పడుతూ) నేను ఏ యేసానికైనా సరి పోతానంటారా బాబూ?

ఆనంద్: ఓహో! దివ్యంగా సరిపోతావు.

దండ: సూడండి బాబూ! నేను యింతలావు ఇంత పొడుగు వున్నానుగదా. ఏ యేసానికి సరిపోతానంటారు?

ఆనంద్: ఘటోత్కచుడు, మాయులమరాఠీ, భేతాళుడు, మొద్దబ్బాయి మొదలైన వేషాలకు అమోఘంగా సరిపోతావు.

దండ: (ఉత్సాహాన్ని పట్టలేక) అబ్బో! యికనేం! యీ దొండపాణి తార మారతందన్నమాట!

[ఊహాజగత్తులో విహరిస్తున్నవాడిలా నెమ్మదిగా అడుగులు వేస్తూ మేడమెట్లు దిగి వస్తాడు దినకర్.]

దిన: (సోఫాలో కూర్చుని చేతిలోనిపుస్తకం తెరచి]

నీడలేని

కూడులేని మనిషీ

నిలచి చూడు

పిలచి చూడు

పలుకని యీ లోకంపై

పగను విడిచి, వగను విడి

నిలచిచూడు

పిలచి చూడు.

(రాస్తూ వుంటాడు.)

ఆనంద్: కాఫీ పడగానే కవిగారి కవితావాహిని సెలయేరులా సాగిపోతోంది.

దండ: ఈ డింకర్ బాబుగారు పిచ్చోడిలా ఎప్పుడూ రాసుకుంటూనే కూచుంటారు బాబూ!

ఆనంద్: కవిత్వానికీ పిచ్చికీ చాలా దగ్గర సంబంధం వుంది. ఏమంటారు మిస్టర్, దినకర్?— మా మేనమామకు యిద్దరు పిల్లలు వున్నారు. వారిలో ఒకడు కవి అయ్యాడు. మరొకడు పిచ్చివాడయ్యాడు.

(దినకర్ తల ఎత్తకుండా రాసుకుంటున్నాడు.)

దండ: రండి బాబూ! మేనేజరుగారి దగ్గరకు తీసికెళతాను.

[ముందు దండపాణి వెనుక ఆనంద్ కుడివైపు నిష్క్రమిస్తారు. దినకర్ దీర్ఘంగా ఆలోచిస్తూ రాస్తున్నాడు. మధ్య మధ్య పైకి చదువుతున్నాడు.)

దిన: (చదువుతూ)

నువు నిర్మించిన బానిసల శిబిరం
పునాదులతో కదులుతోంది
కదులుతోంది.

(కుడివైపునుంచి దామోదరం వస్తాడు. సిల్కుపంచె, కోటు, చేతులకు విలువైన ఉంగరాలు— ముఖంలో గర్వం,

కీవి కనిపిస్తున్నాయి.)

దిన: (ఒకసారి తలయెత్తి దామోదరంకేసి చూసి తిరిగి రాసుకుంటూ)

నిరాశల రాసిలోని
"నిన్న"ను విస్మరించు
రేపటి ఉషస్సులో
నీ ఆశలు చిగురించును.

దామో: (దినకర్ కేసి పరిశీలనగా చూసి) వామన మూర్తిగారెక్కడ?

దిన: (వినిపించుకోకుండా తన ధోరణిలో)

ఎటునుండో వచ్చు నొకడు
ఎచ్చటికో పోవు నొకడు
వచ్చునపుడు తెచ్చినదేది?
పోవునపుడు గొనిపోవునదేమి?

దామో: (చుట్టూ కలయజూచి గత్యంతరంలేక దినకర్‌తో) ఏమయ్యా? నేను చెప్పినది వినిపించడం లేదూ?

దిన: (బాహ్య ప్రపంచంలోకి వచ్చి ఆఁ) ఏమిటి?

దామో: వామనమూర్తిగారు వున్నారా?

దిన: వున్నారు.

దామో: ఎక్కడ ?

దిన: అదే తెలియదు.

దామో: (నిస్పృహతో కుర్చీలో కూర్చుని) నీకు కొంచెం మతి

స్థిమితం లేదా ?

దిన: లేదు. ఎంతమాత్రం లేదు. ఈ కల్లోల జగత్తులో మతి స్థిమితంగా వుండడానికి వీల్లేదు.

దండ: (నేపథ్యంలో) లేదు. యీ్యాల్లేదు. అంతకంటే దమ్మిడీ తగ్గదు.

(కుడివైపునుంచి మాట్లాడుకుంటూ దండపాణి ఆనంద్ వస్తారు.]

ఆనంద్[ కళాకారులకు కన్సెషన్ లేదా?

దండ: బాబుగారు వృత్తినే వుండడానికైనా ఒప్పుకుంటారుగాని ధర తగ్గించరు.

ఆనంద్: ఔరా! కళాకారుడు ఒకరాత్రి తల దాచుకునేందుకు వెల మూడు రూపాయల ముప్పావలా?

దిన: (రాసుకుంటూ)

ఇలాతలంలో అన్నీ వున్నా
వెలలేనిది ఏదీ దొరకదు.

దండ: (ఆనంద్‌తో) ఇంక మీ గదిలో కెళ్ళండిబాబూ! ఆరో నంబరుగది అదే!

( ఎడమవైపు చూపిస్తాడు, ఇంతలో అకస్మికంగా దామోదరాన్ని చూసి భయ సంభ్రమాలతో) ఎంతసే పయ్యింది బాబూ మీరొచ్చి? మీ కోసమే బాబుగారు సూ స్తన్నారు.

దామో: ఇదేరావడం. వామనమూర్తిగా రెక్కడ?

దండ: పైనున్నారు. ఇప్పుడే తీసుకొస్తాను. (ఒక అడుగు ముందుకువేసి ఆనంద్, దినకరులకేసి తిరిగి) బాబూ! ఇంక మీ గదులలోకి మీ రెళ్ళిపోవాలి.

[మేడమీదికి వెళ్ళిపోతాడు.]

ఆనంద్: (దినకర్‌తో) ఓ కవిరాజా! పొరబాటు! ఓ భావకవీ! ఈ పూట నాగదికి వచ్చి నా ఆతిథ్యాన్ని స్వీకరించు.

దినకర్: (లేచి) వస్తాను. తప్పకుండా వస్తాను. ఎవరు పిలిచినా వస్తాను. "సిగ్గేలా భావకవికి సిరిసిరిమువ్వా!" అన్నా డొక సోదరకవి.

[ముందు ఆనంద్, వెనుక దినకర్ ఎడమవైపు నిష్క్రమిస్తారు— మేడమీదినుంచి టక టక చప్పుడు చేస్తూ ముందు వామనమూర్తి వెనుక దండపాణి వస్తారు. వామనమూర్తి లావుగా, పొట్టిగా వున్నాడు. సూటు, బూటు, హేట్-పూర్తి నవనాగరికునివలె కనిపిస్తాడు. అతని ముఖంలో వయస్సు మళ్ళుతున్న చిహ్నాలు కొద్దిగా కనిపిస్తున్నై.]

వామనమూర్తి: మీకోసమే చూస్తున్నాను దామోదరంగారూ! మీరొక్కరే వచ్చారేం? అబ్బాయిని తీసుకు రాలేదా? (కుర్చీలో కూర్చుంటాడు.)

దామో: లేదండీ వాడికిఒక క్షణంకూడ యింట్లోకాలు నిలవదు.

ఎప్పుడూ పట్నంలోనే మకాం.

వామన: పెళ్ళయినతరువాత మహారాజులా దారికి వస్తాడు. అటువంటివాళ్ళను మనం ఎందరిని చూడలేదుగనక. (దండపాణితో) యింకా యిక్కడే వున్నావేం?

[దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు]

దామో: వాడికి స్నేహితు లెక్కువ. వాడి స్నేహితులలో పనికివచ్చే గుణాలు ఒక్కడికీ లేవు. ఏవో సినిమా లంటారు నాటకా లంటారు. వాళ్ళ వ్యవహారా లేమిటో నాకు బోధపడవు.

వామన: ఈ కాలపు పిల్లలందరూ ఇంచుమించుగా అంతేనండి. వాటిని మనమంతగా పట్టించుకో నక్కరలేదు.

దామో: చాలాకాలంనుంచి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాను. చాలా సంబంధాలు చూశాను. కొన్ని నాకు నచ్చలేదు. అన్ని సంబంధాలు వాడికి నచ్చలేదు.

వామన: అయితే మనం యిద్దరం ఒకేదారిలో నడుస్తున్నా మన్నమాట. మా అమ్మాయికి యీ ఒక సంవత్సరంలోను అనేక సంబంధాలు చూశాను. ప్రతి పెళ్ళికొడుకునీ మా చిత్ర ఏదో పరీక్ష చెయ్యడం. పనికిరాడు పొమ్మనడం జరుగుతూ వచ్చింది.

దామో: మీ అమ్మాయి చిన్నప్పటినుంచీ మీ దగ్గర లేదని విన్నాను.

వామన: అవును. నిజమే. తల్లి పోయినప్పటినుంచీ 'కాన్వెంటు' లోవుంచి చదివించాను.

దామో: యూరోపియన్ స్కూళ్ళలో చదువుకున్న పిల్లలకు విచిత్రమైన అలవాట్లు వుంటాయి. వాటితో మనం సరి పెట్టుకొనడం కష్టం.

వామన: పెద్దకష్టం యేమీకాదు. ఇంటిని అందంగా అలంక రించుకోవా లంటారు. సరిగా అనుకున్న సమయానికీ నియ మం హెచ్చుతగ్గులు లేకుండా పని జరగా లంటారు— ఇటు వంటివి మొదటిలో మనకు కొంచెం కష్టం కలిగిస్తాయి.

దామో: మావాడి పెళ్ళిగురించి చాలా ప్రయత్నాలు చేసి విసిగిపోయాను. మీ అమ్మాయి బాగా చదువుకున్నదీ, తెలివైనదీ గనక చివరిసారిగా యీ ప్రయత్నం కూడా చేసి చూద్దామని వచ్చాను.

[కుడివైపునుంచి దండపాణి ట్రేలో కాఫీ తీసుకువస్తాడు కప్పులు టేబిలుమీద పెట్టి కుడివైపు నిష్క్రమిస్తాడు. వామన మూర్తి, దామోదరం కాఫీ తాగుతూ మాట్లాడుతూ వుంటారు.]

వామన: మీ అబ్బాయినికూడా తీసుకువస్తే యిప్పుడే ఏదో ఒకటి తేలిపోయి వుండేది.

దామో: తీసుకువద్దామనే అనుకున్నాను. వీలుపడలేదండీ, ఇవేళే మనిషిని పట్నం పంపించాను. సాయంత్రానికి వాణ్ణి తీసుకు వస్తాడు.

వామన: మీవాడు పట్నంలో ఏం చేస్తున్నట్లు?

దామో: పనేమీలేదు. కష్టపడి సంపాదించాలన్న బెంగ వాడికి లేదు. స్నేహితులతో ఖులాసాగా తిరుగుతూ వుంటాడు.

వామన: ఈ పెళ్ళికి నాయిష్టం యేమీలేదు. మా అమ్మాయికి వరుడు నచ్చితే నిముషాలమీద పెళ్ళిచేస్తాను. మీ అబ్బాయిని పంపండి. ఎప్పుడు పంపేదీ ముందుగా తెలియజెయ్యండి.

దామో: రేపు సాయింత్రం వాడే వస్తాడు. ముందు మనం అన్ని విషయాలు పరిష్కరించుకోవడం మంచిదని నేను ఒక్కడినే వచ్చాను.

వామన: పరిష్కరించుకోవడాని కేమీలేదు. నాకు ఒక్కతే కూతురు. నా ఆస్తి అంతా ఆమెకే చెందుతుంది.

దామో: ఆస్తిగురించి, కట్నం కానుకల గురించి నాకేమీ పట్టింపులేదు. మీ వంశం సంప్రదాయం చూసే మీ సంబంధానికి నేను పూర్తిగా యిష్టపడుతున్నాను.

[ చిత్ర మేడమీదినుంచి తొందరగా దిగి వస్తుంది. చేతిలో పుస్తకం వుంది ]

చిత్ర: (వామనమూర్తిని సమీపించి) డాడీ! దినకర్ ఎక్కడ?

వామన: ఏమో? నేను చూడలేదమ్మా! ఎందుకు?

చిత్ర: ఈ పద్యానికి అర్థం కావాలి. (తొందరగా ఎడమవైపు నడుస్తూ వుంటుంది)

వామన: చిత్రా!

చిత్ర: (ఎడమ చివర ఆగి) ఏం డాడీ?

వామన: ఇలా రా అమ్మా! ఒక క్షణం కూర్చో!

[తిరిగి సోఫాలో కూర్చుంటుంది]

దామో: (చిత్రతో) నీకు తెలుగు చదవడం రాయడం బాగా వచ్చునా అమ్మాయ్?

చిత్ర: (నిర్మొహమాటంగా) తెలుగు రాకపోయినంత మాత్రాన నష్టం యేమీ లేదులెండి.

వామన: అయినా ఎందుకైనా మంచిదని యీమధ్యనే కొంచెం తెలుగు చెప్పిస్తున్నానులెండి.

దామో: (చిత్రతో) యింకా నీకేమేమి వచ్చును?

చిత్ర: (సూటిగా) అంటే మీ ఉద్దేశం?

వామన: నువ్వు స్కూల్లో ఏమి నేర్చుకున్నావో చెప్పమని వారి ఉద్దేశం.

దామో: అవును అదే నే నడిగేది.

చిత్ర: నో! నో! ఐ కాంట్ టెల్ దట్ ఎట్ ఒన్స్. లేచెళ్ళి టైంటేబిలు తీసుకు వస్తాను. దానినిబట్టినేను చదివిన సబ్జెక్టు మీరు తెలుసుకోగలరు. (లేస్తుంది)

దామో: వద్దు! వద్దు! నీకు జ్ఞాపకమున్నవే చెప్పు!

చిత్ర: ఇంగ్లీషు, అర్థమెటిక్స్, సివిక్సు, ఆల్‌జీబ్రా, బ్రిటిష్ హిస్టరీ, డొమెస్టిక్ సైన్సు,డ్రాయింగ్ అండ్ పెయింటింగ్

యివిగాక రింగ్ టెన్నిస్, టేబిల్ టెన్నిస్, బాస్కెట్ బాల్, బాడ్మింటన్ కూడా వచ్చు. (చిరాకుతో) ఈ వివరాలన్నీ మీకెందుకో నాకర్థం కావడంలేదు.

వామన: పట్టినే తెలుసుకోవడానికి అడుగుతున్నారమ్మా!

చిత్ర: డాడీ! కొంపతీసి యీయనే పెళ్ళికొడుకు కాదుగదా?

వామన: అలా తొందరపడి మాట్లాడకూడదమ్మా! వీరిఅబ్బాయి పెళ్ళికోసం ప్రియత్నాలు చేస్తూ యిక్కడకు వచ్చారు.

చిత్ర: ఐసీ! దెన్ వేరీజ్ హి? అతడు కనిపించడేం?

వామన: అబ్బాయి రేపు వస్తాడు. (దామోదరంతో) రేపు సరిగా ఎన్ని గంటలకు వస్తారో చెబితే మాకు యితర ఏర్పాటులు చేసుకోవడానికి వీలు వుంటుంది.

దామో: రేపు సాయంత్రం వస్తాడు.

వామన: మీరు కూడా రారా?

దామో: రేపు మా కంపెనీకి కొత్త ఏజంట్లును సెలక్టు చెయ్యాలి. నాకు రావడానికి తీరిక వుండదు.

వామన: మీ అబ్బాయిని ఒక్కడినే పంపుతారా?

దామో: పెళ్ళిచూపులకు వచ్చేటప్పుడు ఒక్కణ్నీ ఎలా పంపుతాను. మా అల్లుణ్ని కూడా పంపుతాను.

వామన: సరే! అలాగే కానివ్వండి— మీ అబ్బాయి పేరేమిటన్నారు?

దామో: ఏమని చెప్పమంటారు? నేను పెట్టినపేరు వాడు

పట్నం వెళ్ళగానే మార్చుకున్నాడు.

చిత్ర: చాలాబాగుంది. అప్పన్న, పుల్లయ్య మొదలైన పేర్లు పెడితే మార్చుకోక ఏంచేస్తారు? మీ అబ్బాయి చాలా మంచిపనే చేశాడు.

దామో: ఎవరైనా ఒకసారి మార్చుకుంటారు. కాని వాడు మూడుసార్లు మార్చుకున్నాడు.

వామన: అదంతా నాగరికత అండీ! మనం ఏమీ అనలేం. ప్రస్తుతం అసులులో వున్న పేరేమిటి?

దామో: నెలరోజుల క్రితం వరకూ నిరంజన్.

వామన: రేపు తప్పకుండా పంపండి. మీ అబ్బాయిని చూసిన తర్వాత మానిర్ణయాన్ని మీకు తెలియజేస్తాం.

దామో: నాకు అన్నివిధాలా, మీ సంబంధం చెయ్యాలనే కుతూహలంగా వుంది. అదృష్టం బాగుండి వాళ్ళిద్దరికీ ఒకరికి ఒకరు నచ్చితే మనశ్రమ ఫలిస్తుంది. (లేచి) మరి యిక నేను వెళ్ళి వస్తాను వామనమూర్తిగారూ!

వామన: (లేచి) మీ అబ్బాయినిమాత్రం రేపు సాయంత్రం తప్పకుండా పంపండి.

దామో: ఈ పెళ్ళిగురించి మీకంటే నాకే ఎక్కువ తొందరగా వుంది. రేపు సాయింత్రం సరిగా 4 గంటలకు మాఅబ్బాయి మా అల్లుడూ కలిసి వస్తారు.

వామన: సరే! వాళ్ళిద్దరకూ యిష్టమైతే మిగిలిన విషయాలు

మనం కావలసినంత స్థిమితంగా మాట్లాడుకోవచ్చు. (కుడి సైపు చూస్తూ) దండపాణీ! దండపాణీ!

దండ: (ప్రవేశించి) కారు సిద్ధంగా వుందిసార్.

[వామనమూర్తి, దామోదరం, వారివెనుక వినయంతో దండపాణి కుడివైపు నిష్క్రమిస్తారు— చిత్ర ఒకసారి పుస్తకం తెరచి చూసి ఎడమవైపు వెడుతూ వుంటుంది —తెర.]

# నీ లి తె ర లు

## [ రెం డ వ అం కం ]

[ స్థలం:— విశాలమైన ఆఫీసు గది.
సమయం:— మధ్యాహ్నం 3 గంటలు ]

గది మధ్య పెద్దటేబిలు, ఒక కుర్చీ; గదికి కుడిచివర విజిటర్సు కూర్చునేందుకు ఒక పొడుపాటి బెంచీ వున్నాయి. బెంచిమీద జయరాంకూర్చుని పేపరు చదువుతున్నాడు. టేబిలు మీద ఒకవైపు ఆఫీసుఫైల్సు, మరోవైపు కొన్ని కాగితాలు వాటిమీద పేపరు వెయిట్సు వున్నాయి. వెనుకవైపు గోడ మీద కేలండర్లు,గడియారంవున్నాయి. గడియారం 3గంటలను

సూచిస్తోంది. కుడివైపునుంచి కిశోర్ వస్తాడు. సన్నంగా, పొడుగ్గా వున్నాడు. ముఖంలో ఉత్సాహం, చురుకుతనం కని పిస్తూ వుంటాయి. చేతిలో తోలుసంచీ వుంది. కిశోర్‌ను చూడ గానే జయరాం ముఖానికి పేపరు అడ్డుపెట్టుకొని సీరియస్‌గా చదువుతున్నట్లు నటిస్తాడు. కిశోర్ ప్రవేశించగానే ముందుకు చూస్తాడు. కుర్చీ ఖాళీగా వుండడం గమనిస్తాడు. ప్రక్కకు తిరిగి చూసేసరికి పేపరు ముఖానికి అడ్డుపెట్టుకున్న జయరాం కనిపిస్తాడు.)

కిశోర్: (జయరాంతో) మేనేజరుగారు వున్నారా?

జయరాం: (పేపరు ముఖానికి మరింత అడ్డుపెట్టుకొని) వుండ వచ్చును.

కిశోర్! (సస్పృహతో) చచ్చాంరా! భగవాన్! యీయన ఎవరో వేదాంతిలా వున్నాడు. (తిరిగి జయరాంతో విన యంగా) ఒకవేళ వారు లోపలవుంటే నేను వచ్చానని చెబుతారూ?

జయ: వారికి సర్వమూ తెలుసును.

కిశోర్: (కోపంతో) యింతకూ తమరువరు?

జయ: త్వమేవాహం. నీవే నేను. నేనే నీవు.

కిశోర్: అయితే తమరు— వేదాంతి, పిచ్చివాడు, భావకవి —యీ ముగ్గురిలో ఎవరో ఒకరై తీరాలి. (జయరాం పరి

శీలనగా చూస్తూ) కాస్త ఆపేపరు అడ్డుతొలగించి తమ ముఖారవిందాన్ని చూడనిస్తారూ ?

జయ: నాలో నీవు, నీలో నేనూ కనిపించేటప్పుడు నన్ను వేరే చూడవలసిన అవసరమేమి కలదు?

కిశోర్: (హేళనగా) కలదు స్వామీ కలదు. తమవంటి మహానుభావులను చూడలేకపోయినందుకు విచారించే రోజు రావచ్చును. కనక తమ మేలిముసుగు తొలగించండి. (జయరాం చేతిలోని పేపరు లాగుతాడు. జయరాం లేచి నిలబడతాడు. అతనిని చూడగానే కిశోర్ ఆశ్చర్యపోతాడు.)

కిశోర్: (ఆశ్చర్యంతో) ఇక్కడికి ఎందువు వచ్చావు నువ్వు?

జయ: (నవ్వుతూ) నువ్వు ఎందుకు వచ్చావో నేనూ అందుకే వచ్చాను.

కిశోర్: నిన్న కనిపించినప్పుడు— నువ్వుకూడా యీ వుద్యోగం కోసం వస్తున్నట్లు— నాతో ఎందుకు చెప్పలేదు?

జయ: నీతో ప్రతివిషయం చెప్పితీరాలన్న ఎగ్రిమెంటు మన యిద్దరిమధ్యా యేమీలేదు.

కిశోర్: సంతోషించాంలే నీ తెలివికి! నువ్వు వచ్చేముందు తెలియ జేస్తే యిద్దరం కలిసి సరదాగా వచ్చేవాళ్ళంగా!

జయ: నువ్వుకూడా యీ ఏజంటు ఉద్యోగానికి తగులడతావన్న విషయం నాకు తెలిసి ఏడిస్తేకదూ!

కిశోర్: ఎంతసేపయింది నువ్వు వచ్చి ?

జయ: పదినిముషా లవుతుంది.

కిశోర్: మేనేజరుగారు కనిపించారా ?

జయ: లేదు. ఆఫీసుబోయ్ కనిపించి యిక్కడ కూర్చోమని చెప్పాడు.

కిశోర్: మొత్తం వేకెన్సీలు నాలుగుకదా! మనం యిద్దరమే కనిపిస్తున్నాం. యింకా ఎవరూ రాలేదేం ?

జయ: ఇటువంటి తాడూ బొంగరంలేని వుద్యోగానికి ఎవడు వస్తాడు కిశోర్ ?

కిశోర్: ఈ పవిత్ర భారతదేశంలో మనకంటే పనికిమాలినవాళ్ళు లేరంటావా ?

జయ: ముమ్మాటికి లేరనే నా నమ్మకం. యీ ఏజంటు ఉద్యోగానికి ఒక గ్యారంటీ లేదు; ఒక స్థిరం లేదు. పైగా ఐదు వందలు డిపాజిట్ కట్టాలి. ఏ క్షణంలోనైనా వాళ్ళు మనల్ని ఉద్యోగం నుంచి తొలగించవచ్చు. యిటువంటి ఉద్యోగానికి మనలాంటి దిక్కులేనివాళ్ళు రావాలిగాని యిక ఎవరు వస్తారు ?

కిశోర్: మంచి ఉద్యోగాలకోసం ఎదురుచూస్తూ కూర్చుంటే సంవత్సరాలకు సంవత్సరాలే దొర్లిపోతున్నాయ్. యిలా ఎంతకాలం వృథాగా గడపడం ?

జయ: సరే! యీ ప్రయత్నం కూడా చేసి చూద్దాం,

కిశోర్: (దీనంగా) మనం చదువుకొనే రోజులలో ఎన్నెన్ని,

తీయని కలలు కన్నాం. చదివిన చదువును పణంగా పెట్టి కడుపు చేత్తో పట్టుకొని ఉద్యోగాలకోసం తిరిగే రోజులు వస్తాయని కలలోకూడా వూహించలేదు.

జయ: బుద్ధి భూములు పాలించాలని వుంటే రాత గాడిదలను తోలాలని వుందట!

కిశోర్: ఆరోజు లెటువంటివి? సముద్ర తరంగాలలా విరామం లేకుండా ఒకదానివెంట ఒకటి పొంగివచ్చే భావతరంగాలలో ఊగిసలాడుతూ యౌవన ప్రాంగణంలో అడుగుపెట్టాం. మొదటిమెట్టుదగ్గరే నిస్పృహాకు లోనై నిలిచిపోయాం. ఆ రోజులు తలచుకొంటే...

(ఎడమవైపునుంచి బూటుచప్పుడు వినిపించగానేమాట మధ్యలో ఆపుచేస్తాడు కిశోర్. దామోదరం ఠీవిగా ప్రవేశిస్తాడు.)

దామో: మీరిద్దరేనా వచ్చింది?

జయ:
కిశోర్: } అవును సార్.

దామో: (కుర్చీలో కూర్చుంటూ) ఒక క్షణం కూర్చోండి. యీ కాగితాలు చూసినతరువాత మాట్లాడతాను.

(జయరాం, కిశోర్ బెంచీమీద కూర్చుంటారు. దామోదరం టేబిలుమీద కాగితాలు తీసి సంతకం పెడుతూంటాడు. కొన్ని క్షణాలు నిశ్శబ్దం.)

దామో: (ఒక కాగితం తీసి) కిశోర్ ఎవరు?

కిశోర్: (లేచి) నేను సార్. (దామోదరం దగ్గరకు వెళ్ళి నిలబడతాడు.)

దామో: (మరోకాగితం తీసి) జయరాం ?

జయ: నేనే సార్! (లేచివచ్చి కిశోర్ ప్రక్క నిలబడతాడు)

దామో: మీ క్వాలిఫికేషన్సు ?

(యిద్దరూ వినయంగా సర్టిఫికేట్లు తీసి చూపిస్తారు.)

కిశోర్: ఇద్దరం ఇంటర్మీడియట్ పాసయ్యాం సార్!

దామో: (సర్టిఫికేట్లు పరిశీలించి) యీ రోజులలో పై చదువులు చదివినవాళ్ళకు ప్రపంచజ్ఞానం బొత్తిగాతక్కువగావుంటోంది.

కిశోర్: మా కాలేజీలో వున్న "గ్లోబ్"లో ప్రపంచం అంతా కనిపిస్తుంది సార్.

జయ: ప్రపంచంలోని ప్రతి ఖండాన్ని విడమర్చి మరీ చెప్ప గలం సార్.

దామో: ప్రపంచజ్ఞానం అంటే ఏమిటోన్ 'జనరల్ నాలెడ్జి'

కిశోర్: కాలేజీని విడిచిపెట్టి ప్రపంచంమీద పడగానే మాకు కాస్తాకూస్తో ప్రపంచజ్ఞానం కూడా వచ్చిందనే అనుకుంటు న్నామండి.

జయ: యీ మధ్య ఉద్యోగాలకు అప్లికేషన్లు పెట్టడంద్వారా సెక్యూరిటీస్, క్రాస్డుపోస్టల్ ఆర్డర్సు మొదలైన కొత్తపదా లకుకూడా అర్థాలు తెలుసుకున్నాం సార్.

దామో: జనరల్ నాలెడ్జిమీద కొన్ని ప్రశ్నలు వేస్తాను. జవాబులు చెప్పగలరా ?

కిశోర్: ఓ! మీకు తోచిన ప్రశ్నలు వెయ్యండి. జవాబులు చెబుతాం.

దామో: నేడు మన దేశాన్ని పాలిస్తున్నవారెవరు?

జయ: నిరాడంబర దేశభక్తులు !

దామో: అది జవాబు కాదు.

కిశోర్: నేను చెబుతానండి. మన దేశాన్ని పాలిస్తున్నవారు ప్రజా ప్రతినిధులు.

దామో: యస్. యు ఆర్ రైట్, మరొక ప్రశ్న, రవీంద్రనాథఠాగూర్ ఎవరు ?

జయ: నోబెల్ బహుమతి పొందిన మొదటి భారతీయ కవి.

కిశోర్: ఆ జవాబు ఎవరైనా చెప్పగలరు. (దామోదరంతో) నేను చెబుతానండి. బ్రహ్మ సమాజ మత స్థాపకులలో ఒకరైన దేవేంద్రనాథ ఠాగూర్‌గారి కొడుకు రవీంద్రుడు. మరియు వీరు 'శాంతినికేతనము'ను స్థాపించిరి.

దామో: శాంతినికేతనంలో వుండే శాంతికి, నేడు ప్రపంచంలో బయలుదేరిన శాంతి ఉద్యమాలలోని శాంతికి తేడా ఏమైనా వుందా ?

జయ: కావలసినంత తేడా వుందిసార్. శాంతినికేతనంలో వుండే శాంతి చిత్తశాంతి. ఉద్యమాలలోని శాంతి రాజకీయశాంతి.

దామో: 'కోల్డువార్' అంటే ఏమిటి? అది ప్రస్తుతం ఎక్కడైనా జరుగుతోందా?

కిశోర్: కోల్డువార్ అనగా శీతలయుద్ధం. అది ప్రస్తుతం దేశానికీ నిరుద్యోగులకూ మధ్య జరుగుతోందండి.

దామో: ఒక ప్రతిపక్ష నాయకుడు ఉదయం 10 గంటలకు విశాఖపట్నంలో ట్రైన్ ఎక్కాడనుకోండి. అతను గుంటూరు చేరుకొనేసరికి ఎంతకాలం అవుతుంది?

జయ: ఆ రాత్రి 10 గంటలయ్యేసరికి చేరుకోగలడు.

కిశోర్: కాదు! కాదు! అలా జరగదు. ప్రతిపక్ష నాయకుడు తిన్నగా, ముక్కుకు సూటిగా ఎప్పుడూ ప్రయాణం చెయ్యడు. అతడు దారిలో ఏ రాజమండ్రిలోనే దిగి ఆకలి యాత్రకు నాయకత్వం వహిస్తాడు. పోలీసులు అరెస్టు చేస్తారు. సెంట్రల్ జైలుకు వెడతాడు. అతడు తిరిగి విడుదలయ్యేసరికి గుంటూరు వెళ్ళవలసిన పని కాస్తా పూర్తిఅయి వూరుకుంటుంది.

దామో: (సంతోషంతో) చాలా బాగుంది. మీ యిద్దరికీ ప్రపంచజ్ఞానం సంతృప్తికరంగానే వుంది. మీ పూర్వానుభవానికి సంబంధించిన సర్టిఫికెట్లు కూడా చూపిస్తే మిమ్మల్ని సెలక్టు చేస్తాను.

(జయరాం కిశోర్ నిరాశతో ఒకరి ముఖం ఒకరు చూసుకుంటారు.)

జయ: మేం యిదివరకు ఎక్కడా ఉద్యోగం చెయ్యలేదు సార్.

దామో: అయితే లాభంలేదు. ప్రీవియస్ ఎక్స్పీరియన్సు లేని వాళ్ళకు ఉద్యోగాలు యివ్వడానికి వీల్లేదు. మా కంపెనీ నిబంధనలలో అది ఒకటి.

కిశోర్: మేం ఉద్యోగాలకోసం ఎక్కడకు వెళ్ళినా పూర్వాను భవం గురించే అడుగుతున్నారు. పుట్టుకతోనే పూర్వాను భవం వస్తుందా సార్? మీరు ఒకసారి ఛాన్సు యిస్తే కావలిసినంత అనుభవం సంపాదిస్తాం.

దామో: అబ్బే! అదేం లాభంలేదు. మా కంపెనీ నిబంధనలు చాలా ఖచ్చితమైనవి. వాటిని మార్చడానికి రవంతకూడా వీలులేదు.

జయ: (దైన్యంతో) మమ్మల్ని వచ్చిన దారినే వెళ్ళిపొమ్మం టారా సార్ ?

దామో: అవకాశంలేదు. వుంటే మిమ్మల్ని తప్పకుండా సెలెక్టు చేసేవాణ్ణి. అనుభవం సంపాదించుకోండి, ముందు ముందు వేకెన్సీలు క్రియేట్ అయినప్పుడు చూస్తాను.

కిశోర్: (నిస్పృహతో) యీ వ్యవహారంకూడా తేలిపోయింది. పదరా జయరాం! పోదాం!

జయ: }
కిశోర్: } వస్తాంసార్. (నమస్కారంచేసి కుడివైపునిష్క్రమిస్తారు).

దామోదరం తిరిగి ఆఫీసు కాగితాలు చూస్తు వుంటూ వుంటాడు.)

దామో: (ఏదో స్ఫురణకు వచ్చినట్లు రిస్టువాచీ చూసుకొని ఎడమవైపు తిరిగి) నిరంజన్! నిరంజన్!

నిరంజన్: (నేపథ్యంలోంచి) వస్తున్నాను నాన్నా!

దామో: (బిగ్గరగా) టైమవుతోంది. యింకా నువ్వు యిక్కడే కూర్చుంటే ఎలా?

(ఎడమవైపునుంచి నిరంజన్ వస్తాడు. ఫుల్ పాంటు, అమెరికన్ జాకెట్ వేసుకున్నాడు. గుండ్రని ముఖం, వెనక్కి దువ్విన తల— పూర్తిగా నవనాగరికుడిలా కనిపిస్తున్నాడు.)

నిరంజన్: (దామోదరాన్ని సమీపించి) అయితే వెళ్ళడం తప్పదా నాన్నా?

దామో: (నిస్పృహతో కుర్చీకి జేరబడి) మళ్ళీ మొదటికి వచ్చావ్?

నిరం: నామాట విను నాన్నా! ప్రస్తుతం పెళ్ళిచేసుకోనడం నాకు యిష్టంలేదు.

దామో: బ్రతుకులో స్థిరం లేకుండా యిలా ఎంతకాలం తిరుగుతావ్?

నిరం: అలా అని తొందరపడి యిష్టంలేని ఒక అమ్మాయి మెడకు తాడు కట్టమంటావా?

దామో: (కోపంతో) వామనమూర్తిగారి గురించి నీకేమైనా తెలుసా ?

నిరం: తెలియదు.

దామో: ఆయన యీ వూళ్ళోని సంపన్నులలో ఒకడు.

నిరం: కావచ్చును.

దామో: ఆయనకు ఒక్కర్తే కూతురు. యిక పిల్లలెవరూ లేరు.

నిరం: అయితే ?

దామో: ఆ పిల్లను పెళ్ళిచేసుకుంటే ఆ ఆస్తి అంతా నీకే దక్కుతుంది.

నిరం: కేవలం డబ్బుకు ఆశించి రెండు నిండు జీవితాలను ధ్వంసం చేసుకోమంటారా?

దామో: జీవితంలో అనుభవం చాలనివాళ్ళు డబ్బుగురించి నిరసనగా మాట్లాడతారు. అటువంటివాళ్ళు నిజజీవితంలో అడుగు పెట్టగానే తమ పూర్వప్రవర్తనకు పశ్చాత్తాప పడవలసి వుంటుంది.

నిరం: తను నమ్ముకొన్న ఆదర్శంకోసం మనిషి కష్టపడడానికి వెనుకాడ కూడదు.

దామో: అవన్నీ ప్రపంచజ్ఞానం లేనివాళ్ళు చెప్పేమాటలు.

నిరం: ఏమైనాసరే ప్రస్తుతం నాకీపెళ్ళి యిష్టంలేదు నాన్నా!

దామో: యీ రోజులలో ఆడపిల్లలు, మగపిల్లలుకూడా పెళ్ళి వద్దువద్దంటూ— ముప్పైఏళ్ళ వయసు దాటేవరకూ

కాలం గడపడం— ఆ తరవాత 'ప్రేమ' 'ప్రేమ' అంటూ ఏ వయసు మళ్ళినదానినో, వయసు మళ్ళినవాడినో పెళ్ళి చేసుకోవడం— ఒక ఫాషన్ అయిపోయింది.

నిరం: దేశంలోను కాలంలోను వస్తున్న మార్పులను గమనిస్తే మీరిలా మాట్లాడరు.

దామో: కొత్త 'మంచి' పాత 'చెడ్డ' అనే నమ్మకం నాకు లేదు— ఇక వృథాగా మాటలతో కాలం గడపకు, పది నిముషాలు మాత్రమే వుంది.

నిరం: వెళ్ళి పెళ్ళికూతురుకు కనిపించడానికి నాకు అభ్యంతరం లేదు. కాని దానివల్ల ఏమీ ప్రయోజనం లేదనే మీకు చెప్పేది.

దామో: వామనమూర్తిగారి అమ్మాయిని నువ్వు ఎప్పుడైనా చూశావా ?

నిరం: లేదు.

దామో: అందుకే నువ్విలా మాట్లాడుతున్నావు. చిత్ర చాలా అందమైనపిల్ల. చదువు, సంస్కారం, తెలివి అన్నీ వున్నాయి ఆమెకు.

నిరం: ఒకరికే నచ్చిన సంస్కారం మరొకరికి నచ్చకపోవచ్చును.

దామో: యిక అటువంటి వ్యర్థ సంశయాలను కట్టిపెట్టి తిన్నగా వెళ్ళిరా.

నిరం: (కుడివైపు వెడుతూ) సరే, ఆ ముచ్చటకూడా తీర్చుకు వస్తాను.

దామో: ఆగు, (నిరంజన్ ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు) నువ్వు ఒక్కడవు వెళితే మర్యాదగా వుండదు. మీ బావనుకూడా తీసుకువెళ్ళు.

నిరం: పెళ్ళికి వెడుతూ పిల్లిని తీసుకువెళ్ళినట్లు అతనెందుకు నాతో!

దామో: (చిరాకుగా) నీతో అంతా చిక్కే! నీకు తెలియదు, చెబితే వినవు.

నిరం: అవసరంలేదునాన్నా! నేను ఒక్కడినే వెడతాను. అందులో తప్పేమీ లేదు.

దామో: సరే! అయితే నీ యిష్టం వచ్చినట్లే చెయ్యి—డబ్బేమైనా కావాలా?

నిరం: వద్దు.

దామో: (నిరంజన్‌ను నఖశిఖ పర్యంతం చూసి) యీ వేషంతోనే వెడతావా?

నిరం: దీనికేం? పెళ్ళిచూపులకు వెళ్ళేవాళ్ళకు యింతకంటే ప్రత్యేక అలంకరణ ఏమైనావుందా?

దామో: (విధిలేక) సరే, నీకు తోచినట్లే వెళ్ళు. వామనమూర్తి గారు ఏమైనా ప్రశ్నలు వేస్తే మర్యాదగా జవాబు చెప్పు.

నిరం: నాకుతోచిన జవాబులు చెబుతాను.

దామో: అదే! ఆ చెప్పేది ఏదో దురుసుగా కాకుండా మృదువుగా చెప్పు.

నిరం: ఆ తరవాత ?

దామో: యిక ఆ అమ్మాయి తలవంచుకు కూర్చునే నేటి పెళ్ళికూతురువంటిది కాదు. ఆమెకూడా నిన్ను రెండుమాటలు అడగవచ్చు.

నిరం: అంతేనా ? యింకా ఏమైనా వుందా ?

దామో: అంతే. (టైంచూసి) మరో ఐదునిముషాలు కూర్చుని వెళ్ళు.

నిరం: యిక ఆలస్యందేనికి ? యిప్పుడే ఎందుకు వెళ్ళకూడదు?

దామో: (విసుగుతో) అబ్బ! నీతో ప్రతివిషయానికి పేచీ— మరో ఐదునిముషాల వరకూ వర్జ్యంవుంది. సరిగా మూడూ యాభై నిముషాలకు బయలుదేరి వెళ్ళు.

(దామోదరం ఎడమవైపు నిష్క్రమిస్తాడు. నిరంజన్ విధిలేక కుర్చీలో కూర్చుంటాడు—కుడిచివర ఆనంద్ కనిపిస్తాడు)

ఆనంద్: నిరంజన్ !

నిరం: (తిరిగిచూసి ఆశ్చర్యంతో) ఆనంద్, ఎప్పుడు వచ్చావు?

ఆనంద్: వూళ్ళోకి నిన్న వచ్చాను. యిక్కడికి ఐదునిముషాల క్రితం వచ్చాను.

నిరం: మరి లోనికి రాలేదేం ?

ఆనంద్: నేను గుమ్మంలో అడుగుపెట్టేసరికి నువ్వూ మీనాన్న

ఘర్షణ పడుతున్నారు. దానితో అమాంతంగా అక్కడే ఆగిపోయాను.

నిరం: దానికేం ? అది ఎప్పుడూ వున్నదేలె ! నువ్వు ఎక్కడ దిగావు ?

ఆనంద్: మహాసముద్రంలాంటి ఒక లాడ్జింగ్ హోమ్‌లో దిగాను.

నిరం: లీలను తీసుకు వచ్చావా ?

ఆనంద్: లేదు. నేను ఒక్కడినే వచ్చాను.

నిరం: అదేం? ఆమె ఎందుకు రాలేదు?

ఆనంద్: మన ఏర్పాట్లు పూర్తికాకుండా ఆమెనుకూడా తీసుకొని రావడం ఎందుకు? మన ప్రయత్నాలు పూర్తి అయిన వెంటనే ఒక కార్డు పోష్టుచేస్తే మూడు నిముషాలలో వచ్చి వాలుతుం దిక్కడ.

నిరం: యీ విషయంలో నువ్వే ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి. డబ్బుగురించి వెనుకాడ నక్కర్లేదు.

ఆనంద్: యీ వూరు, యీ వాతావరణం అన్నీ మన ప్రయత్నాలకు అనుకూలంగా కనిపిస్తున్నాయి. నే నీవూళ్ళో అడుగుపెట్టగానే ఒక భావకవి తారసపడ్డాడు. అతడు చాలా మంచివాడిలా వున్నాడు. ఎక్కువ ఖర్చులేకుండా అతనిత్రో ఒక మంచి నాటకం వ్రాయించడానికి ప్రయత్నిస్తున్నాను.

నిరం: అతని నివాసం ఎక్కడ ?

ఆనం: ప్రస్తుతం అతని 'మకాం' నా 'మకాం' ఒకేచోట.

నిరం: లాడ్జింగ్ హోమ్‌లో వుంటున్నాడా? బాగా డబ్బున్నవాడా యేమిటి ?

ఆనంద్: కవికి, నటుడికి డబ్బువుంటే పరిపంచం యిలా నిద్ర పోతూ వుంటుందటయ్యా మహానుభావా !

నిరం: మరి ఎలా వుంటున్నాడు ?

ఆనం: అదే నాకూ మొదట ఆశ్చర్యం కలిగింది. చివరకు విచారించగా అసలు విషయం తెలిసింది. ఆ విశ్రాంతిభవనం యాజమానికి తెలుగుభాషరాని కూతురు ఒకామె వుంది. ఆ తెలుగురాని తెలుగు బిడ్డకు యీ కవిశేఖరుడు తెలుగు భాషతోపాటు భావ కవిత్వంకూడా నేర్పుతున్నాడు.

నిరం: (ఆశ్చర్యంతో)వూరిచివరవున్న లాడ్జింగ్ హోమ్ గురించా నువ్వు చెబుతున్నది ?

ఆనంద్: అవును! అదే! నేను వూళ్ళో పాదం మోపగానే మొదట అదే తగిలింది. అక్కడే దిగాను.

నిరం: అయితే మనం ఒకేచోటికి చేరుతున్నాం. యిదీ ఒక అందుకు మంచిదే.

ఆనంద్: నువ్వుకూడా అక్కడికే వస్తున్నావా?

నిరం: వేరేపనిమీద వస్తున్నాను.

ఆనంద్: నేనే నిన్ను అక్కడకు తీసుకు వెడదామనుకుంటున్నాను. అక్కడ రిహార్సల్సు చేసుకోవడానికి విశాలమైన హాలు ఒకటి వుంది. అవసరమైనప్పుడు ఆ హాలును మనం అద్దెకు

తీసుకోవచ్చు. వ్రారికి చివరగనక గోలలేకుండా ప్రశాం తంగా మన పని పూర్తిచేసుకోవచ్చు.

నిరం: నాటకం మండలి స్థాపించడానికి చెయ్యావలసిన పనులన్నీ నువ్వే స్వయంగా చూసుకో. వీలైనంత త్వరలో యీా వ్రాళ్ళ్ళే ఒక నాటకం ప్రదర్శించాలి.

ఆనంద్: నాటకంలో అడుగడుగునా కొత్తదనం కనిపించాలి. ఒకసారి చూసినవాళ్ళే తిరిగి చూడడానికి కుతూహల పడాలి.

నిరం: అటువంటి మార్పు తీసుకురావడానికి చాలా శ్రమ పడాలి. సినిమాలలో వున్నట్లు చౌకబారు నాట్యాలు, ప్రేయసీ ప్రియుల యుగళగీతాలు, కథానాయకుని సాహ సాలు, విలన్ చేసే దుర్మార్గాలూ అన్నీ నవరసభరితంగా ప్రదర్శించాలి. అప్పుడే మనం సినిమాలతో పోటీ చెయ్య గలుగుతాం.

ఆనంద్: ఆ సంస్థాలోనే ఒక నాటకం రాయించి చూద్దాం.

నిరం: నీకు కనిపించిన భావకవి యీా రకం నాటకం రాయు గలడా ?

ఆనంద్: అతనిని పరీక్షించి చూశాను. ఎటువంటి ఘట్టాల నైనా సృష్టించగల సామర్థ్యం అతనికి వుంది. కాని చీటికి మాటికి అభ్యుదయం కావాలంటూ వుంటాడు.

నిరం: అభ్యుదయ నాటకాలకు డబ్బురాదు. ప్రభుత్వపు రజిత పతకం మాత్రం దొరకవచ్చు. కనక వాటివల్ల ప్రయోజనం లేదు. ప్రేక్షకులలో క్రోర్కెలను రెచ్చగొడుతూ ఆనందాన్ని కలిగించే నాటకాలు కావాలి.

ఆనంద్: అటువంటి నాటకం రాయడానికి అతను అంగీకరిస్తాడో లేదో తెలియదు.

నిరం: మహారాజులా అంగీరికస్తాడు. దరిద్రంతో బాధపడే ఆకవి గారిని దారిలోకి తీసుకురావడం ఎంతసేపు.

ఆనంద్: అతనురాసే సమయంలో ప్రతి ఘట్టాన్ని మనం పరిశీలించి చూస్తూ వుండాలి. ప్రేక్షకులకు తలనొప్పి కలిగించే స్లోగన్సును ఎప్పటికప్పుడే ఏరి తీసివేస్తూ వుండాలి.

నిరం: ఆ బాధ్యతకూడా నువ్వే తీసుకో.

ఆనంద్: యిక నటీనటుల విషయం— కొత్తవాళ్ళను తీసుకువద్దామా? లేక పట్నంనుంచి పాతవాళ్ళనే తీసుకువద్దామా?

నిరం: స్త్రీ పాత్రధారులు పాతవాళ్ళే వుండాలి. కొత్తవాళ్ళకు నేర్పడం మనతరం కాదు. యికపోతే నటుల విషయం. కావలసినంతమంది నటులు యీ వూళ్ళోనే వున్నారు.

ఆనంద్: రేపటినుంచి పని ప్రారంభిద్దాం.

నిరం: వద్దు యివేళనుంచే ప్రారంభిద్దాం యివేళ నాలుగు గం

టల తర్వాత ముహూర్తం మంచిది వుందని మా నాన్న యిప్పుడే చెప్పి వెళ్ళారు.

ఆనంద్: నాటకమండలి స్థాపించడానికి మీ నాన్నగారు కూడా యిష్టపడుతున్నారా ?

నిరం: ఎంతమాత్రం యిష్టపడడంలేదు. మా నాన్నగారు పెట్టిన ముహూర్తం పెళ్ళిచూపులకోసం. ఆ శుభ సమయాన్ని నాటకమండలి ప్రారంభోత్సవానికి ఉపయోగించుకుందాం.

ఆనంద్: యిప్పుడే ప్రారంభోత్సవం చెయ్యడానికి మన కు మనుషులు లేరే !

నిరం: మనుషులు అక్కర్లేదు. కవిగారితో నాటకానికి 'నాంది' రాయిద్దాం.

ఆనంద్: యింకా యేమైనా ఏర్పాటులు చెయ్యాలా ?

నిరం: టీపార్టీ కూడా చేద్దాం.

ఆనంద్: యిక ఆలస్యం ఎందుకు ? అక్కడికిపోయే అన్ని వ్యవహారాలు చూసుకుందాం.

నిరం: నాకు మరో చిన్న పనివుంది. వూళ్ళోకి వెళ్ళి పనిచూసుకొని వస్తాను. నువ్వు ముందువెళ్ళి కవిగారిని కదలకుండా చూడు.

ఆనంద్: సరే! నేను వెడతాను. నాగది నెంబరు ఆరు. జ్ఞాపకం వుంచుకో!

(కుడవైపు రెండు అడుగులు వేస్తాడు ఆనంద్)

నిరం: ఆనంద్ !

ఆనంద్: (ఆగి) ఏం ?

నిరం: (ఆనందుని సమీపించి) మా నాన్నకు యిటువంటి వ్యవహారాలు కిట్టవు. కనక వీలైనంతవరకూ మన ప్రయత్నాలను రహస్యంగా వుంచాలి.

ఆనంద్: ఫరవాలేదు. రంగస్థలంమీద అడుగుపెట్టేవరకూ మన రహస్యం పైకిరాదు. ఆ తరవాత వ్యవహారం రహస్యంగా వుంచడం మన తరంకాదు.

నిరం: ఆ తరవాతమాట చూసుకోవచ్చు. ప్రస్తుతం గోల రాకుండా చూడు,

ఆనంద్: ఆమాట వేరే చెప్పాలా ?

(ఆనంద్ నిష్క్రమిస్తాడు. నిరంజన్ మరొకసారి టైం చూసుకొని గదిలో అటూ యిటూ తిరుగుతూ వుంటాడు, కుడివైపునుంచి కిశోర్, జయరాం తొందరగా ప్రవేశిస్తారు. నిరంజన్ ఆలోచిస్తూ పరధ్యానంగా తిరుగుతున్నాడు.

కిశోర్: (నిరంజన్‌తో) మేనేజరుగారు వున్నారా ?

నిరం: (చిరాకుతో) యీ ఆఫీసుగదిలో కూర్చుంటే ఎప్పుడూ ఆఫీసుగోల.

[ కుడివైపు నిష్క్రమిస్తాడు. ]

జయ: (నిరంజన్ వెడుతున్నవైపు చూస్తూ) యితని వాలకం చూస్తూవుంటే యితడుకూడా ఏజంట్ల ఎన్నికలో పరా

జయం పొందినవానిలా కనిపిస్తున్నాడు.

కిశోర్: మనమాటకు కనీసం జవాబైనా చెప్పలేదు. తీవ్ర పరాజయంతో బాధపడుతున్నట్లున్నాడు కుర్రవాడు.

జయ: ఈ కొత్తవూళ్ళో మనకు దారీ తెన్నూ కనిపించడంలేదు పలుకరించినా ఒకమనిషీ పలకడంలేదు.

కిశోర్: ఈ అంత్య ప్రయత్నం కూడా చేసిపోదాం. ఇక ఆలస్యం ఎందుకు? మేనేజరు గారిని పిలు!

జయ: (ఎడమవైపు చూస్తూ) అయ్యా! మేనేజరుగారూ!

కిశోర్: (ఎడమవైపు తిరిగి) మేనేజరుగారూ !

దామో: (నేపథ్యంలోంచి) ఏమిటా కేకలు ! (ప్రవేశించి జయరాం కిశోర్‌లను చూసి ఆశ్చర్యంతో) మళ్ళా వచ్చారేం?

కిశోర్: చిన్న మనవి.

దామో: ఇక నాతో మాట్లాడవలసిందేమీలేదు.

జయ: చాలా చిన్నవిషయం సార్! మా యీ చిన్న కోరికను మీరు తప్పకుండా మన్నిస్తారనే వచ్చాం.

దామో: నాకు చాలాపనులు వున్నాయ్. మీరు చెప్పవలసిందేమిటో త్వరగా చెప్పండి.

కిశోర్: మేం ఎక్కడకు వెళ్ళినా పూర్వానుభవం గురించి అడుగుతున్నారండి!

దామో: అవును. నిజమే. కొత్తవాళ్ళతో ప్రారంభంనుంచీ ఎవరు బాధపడగలరు?

జయ: ఇప్పటివరకూ ఉద్యోగాలకోసం తిరిగి తిరిగి అలసి పోతూాం సార్.

కిశోర్: పూర్వానుభవం సంపాదించడానికి మాకు ఒకటేదారి కనిపిస్తోందండి.

దామో: అయితే! ఇహానేం? సంపాదించండి.

జయ: దానికి మీా సహకారం కూడా అవసరం సార్.

దామో: మధ్యన నా సహకారం ఏంవుంది?

కిశోర్: ఉందండీ! మీారు తప్పక సహకరిస్తారని ఆశతోవచ్చాం

దామో: నాకు చేతనైన సహాయం చేస్తాను. ఏమిటో చెప్పండి.

కిశోర్: జీతం ఏమీా అవసరంలేకుండా మీాదగ్గర ఉచితంగా పనిచేస్తామండి.

జయ: (బ్రతిమాలుతూ)మీాకు పుణ్యం వుంటుంది. యీా ఒక్క సహాయం చెయ్యండి. మాకు అనుభవం సంపాదించడానికి యింతకంటే అవకాశం కనిపించడంలేదు.

దామో: ఉచితంగా యితరులచేత ఉద్యోగాలు చేయించడానికి కూడా మా కంపెనీ నిబంధనలు అంగీకరించవు (సాను భూతితో) పాపం! మిమ్మల్ని చూస్తూవుంటే జాలి కలుగు తోంది. యిక వెళ్ళిరండి నాయనా, (ఎడమవైపు నిష్క్రమిస్తాడు. కిశోర్, జయరాం తీవ్రమైన నిస్పృహాతో ఒకరి ముఖం ఒకరు చూసుకుంటారు.)

జయ: మనకంటే ఆడవాళ్ళు నయంరా కిశోర్.

కిశోర్: ఎందుకు ?

జయ: యిటువంటి తీవ్రమైన పరాభవం జరిగినప్పుడు కళ్ళు మూసుకొని ఏ గంగలోనో దూకుతారు.

కిశోర్: యింతటితో సరిపోతే ఫరవాలేదు. యింకా ఎన్ని కష్టాలు పడాలో!

జయ: ప్రస్తుతం మన కర్తవ్యం ఏమిటి ?

కిశోర్: నేటి ప్రపంచంలో రెండుదారులు వున్నాయి. ఒకటి గాఢాంధకారంలోకి తీసుకువెళుతుంది. మరొకటి ఉజ్వల తేజస్సులోకి తీసుకువెళుతుంది. ఏ దారిని పోదాం ?

జయ: యీ పరాభవంలో వెలుగును చూడలేను. చీకటిలోకే పోదాం.

కిశోర్: పద: యీ రాత్రికి ఏ సత్రంలోనో గడుపుదాం. తెల్ల వారిన తరవాత మనవూరికి తిరుగుముఖం పడదాం.

జయ: వద్దు. యిక యీ ముఖంతో మనవూరును చూడడం నాకు ఎంతమాత్రం యిష్టంలేదు.

కిశోర్: ఏం చేద్దామంటావు ?

జయ: ఏదో ఒక ఉద్యోగం దొరికేవరకు నేను మన వూళ్ళో అడుగుపెట్టను.

కిశోర్: హా! చచ్చితిమి. యింతటి భీష్మ ప్రతిజ్ఞచేసి వూరు కొంటే ఎలాగా జయరాం ?

జయ: యీ మహాపట్నంలో తిండి, నీడలేక మాడి చావడాని

కైనా అంగీకరిస్తాను కాని మన వ్వాళ్ళో యీ ముఖంతో తిరిగి అడుగుపెట్టను.

కిశోర్ : సరే! ఏంచేస్తాం! యిక్కడేవుండి తీవ్రమైన ప్రయత్నాలు ప్రారంభిద్దాం. యిక వడు, ఏ సత్రిపుకోపోయి యీ రాత్రికి తలదాచుకుందాం.

జయ: యీ రాత్రిగురించి యిక ఆలోచించడం మాను. రేపటి గురించి ఆలోచించు. ఏం చేద్దాం? ఎక్కడికి వెడదాం?

కిశోర్: ముందు నాలుగురోడ్లు కలిసే కూడలిలోకి వెడదాం. తరవాత వెళ్ళవలసిన దారి నిర్ణయించుకుందాం.

(కిశోర్, జయరాం నిస్పృహాతో కుడివైపు నిష్క్రమిస్తూ వుండగా తెర.)

# సీ లి తె ర లు

[ మూ డ వ అం క ం ]

[ స్థలం:— విశ్రాంతిభవనంలో హాలు.

సమయం:- సాయంత్రం 4 గంటల తర్వాత.

మొదటి దృశ్యంలో కనిపించిన సోఫా టేబిలు, కుర్చీలు

అలాగే వున్నవి. తీవ్రాలోచనలో మునిగి హాలులో అటూ యిటూ తొందరగా తిరుగుతున్నాడు దినకర్. ఆనంద్ సోఫాలో కూర్చుని వున్నాడు. ]

దినకర్: (చేతిలోని పుస్తకాన్ని తెరచి) కాలాన్ని చూడలేని మనిషీ, కళ్ళుమూసుకో. నువ్వు నిర్మించుకున్న ఆదర్శపు భవనాల కంచుగోడలు కదులుతున్నాయి.

ఆనంద్: ( ప్రాధేయ పూర్వకంగా ) కవిగారూ! నా మాట వినండి. ఆదర్శాల చిమ్మచీకటిలోకి ప్రయాణం చెయ్యకండి

దిన: (తన ధోరణిలో) నిరాశల నిసిలో నిలుచొని రేపటి అరుణోదయానికి ఎదురుచూడకు. అరుణోదయానికి పూర్వమే నీలోని జీవుడు రెక్కలు కట్టుకొని లేచిపోతాడంటావా ?. (నవ్వి) వెర్రినాయనా ! అందుకే నిన్నుచూచి నేను జాలి పడేది.

ఆనంద్: దినకర్ మహాశయా ! ఒకసారి బాహ్యప్రపంచంలోకి రండి. చిన్న విషయం మాట్లాడాలి.

దిన: (ఆనంద్ కేసి తిరిగి) బాహ్యప్రపంచంలోకి చూడలేను. చూడగలశక్తి నాలో నశించింది. చెట్టుక్రింద ప్రసవించిన మాతృమూర్తి, పాలులేని పసిబిడ్డ, మానవ శరీరంలోని రక్తమాంసాలను పీల్చి పిప్పిచేసే యంత్రాలు, దారిద్ర్య వారాశిలో మునిగి కొట్టుకుపోయే తండ్రికోసం ఎలుగెత్తి ఏడ్చే పదిమంది పసిబిడ్డలు—చూడలేను, చూడలేను బాహ్య

ప్రపంచాన్ని చూడలేను.

ఆనంద్: మీ రొక్కరూ చింతించినంతమాత్రాన ప్రపంచపు పరిస్థితి బాగుపడుతుందా మహాశయా!

దిన: ఆ మన స్తత్వమే మానవజాతి తిరోగమనానికి ముఖ్యకారణం. ప్రతిమనిషీ చింతించాలి. తన సోదరమానవుల దుస్థితి చూచి కుమిలికుమిలి బాధపడాలి.

ఆనంద్: మీది నిష్కల్మష హృదయం దినకర్. మిమ్మల్ని చూస్తుంటే నాకు ఆనందం కలుగుతోంది. మీరిలా నిత్యదరిద్రంతో బాధపడడం నాకు యిష్టంలేదు.

దిన: నీ యిష్టాయిష్టాలతో నాకేంపని? నా సోదర మానవులతో నేనూ భుజం భుజం కలిపి ధారిద్ర్యరాక్షసితో హోరాహోరీ పోరాడతాను. విజయం కలిగితే సంతోషిస్తాం. వీరస్వర్గం లభి స్తే మరీ సంతోషిస్తాం.

ఆనంద్: మీరు మరీ ఉన్మాద స్థితిలోకి పోతున్నారు దినకర్. నామాట వినండి. నాకో చిన్న ఉపకారంచేసి పుణ్యం కట్టుకోండి.

దిన: అలా అడిగావు, బాగుంది. (కుర్చీలో కూర్చొని) ఏం కావాలి నీకు?

ఆనంద్: నవరసభరితమైన నాటకం ఒకటి కావాలి.

దిన: నన్ను రాయమంటావా? ఏదీ కవితాసామగ్రి అందుకో. కప్పుకాఫీ, సిగరెట్ పెట్టి, సిరావున్న కలం—రాసే!

ఆనంద్: (జేబులోంచి సిగరెట్టుపెట్టె, అగ్గిపెట్టె, తీసి దినకర్‌కు యిస్తాడు. దినకర్ సిగరెట్ వెలిగిస్తాడు.) కాఫీ యిప్పుడే వస్తుంది. (కుడివైపు తిరిగి) దండపాణీ! దండపాణీ!

దండ: (ప్రవేశించి యిద్దరినీ చూసి ఆశ్చర్యంలో) అరే! మళ్ళీ యిక్కడే కూచున్నారూ! యియ్యేళకి మీగదిలో కెళ్ళండి బాబూ యిక్కడికి పెళ్ళికొడుకుగారు వస్తారు.

ఆనంద్: (జేబులోనుంచి డబ్బులుతీసి) రెండుకప్పులు కాఫీ తెచ్చిపెట్టు. అలాగే పోతాం. కాఫీ తాగేవరకూ కవిగారు నాటకం ప్రారంభించరు.

దండ: (డబ్బులు తీసుకోని) నాయేషం మాట మరిసిపోలేదు గదా ఆనందబాబూ.

ఆనంద్: (దినకర్‌తో) చూడండి దినకర్. మీరు రాయబోయే నాటకంలో దండపాణికి సరిపోయేపాత్ర ఒకటి వుండాలి.

దిన: వుంటుంది. తప్పకుండా వుంటుంది. నేను రాయబోయే నాటకంలో దండపాణికి అనగా యమధర్మరాజుకు చాలా ముఖ్యమైన పాత్ర ఒకటి వుంటుంది.

దండ: (సంతోషంతో) సెబాస్! డింకర్‌బాబుగారు రాయడం, నేను వేషం ఎయ్యడం! ఓ! నాసామిరంగా! (ఏదో చప్పున స్ఫురణకు వచ్చినట్లు) నాకు రెండు పాటలుకూడా రాయండి. నాకంటం కంచుకంటంలాంటిది!

ఆనంద్: ఏదీ ఒక పాటపాడి వినిపించు. నీవాయిస్ టెస్టు చేస్తాం

దండ: (ఆలోచిస్తూ) సమయానికి ఏదీ గ్న్యాపకం రాకుండా వుంది. (ఆకస్మికంగా స్ఫురించినట్లు) కోలాటంపాట ఒకటి పాడతాను. (అడుగులేస్తూ హాలు ఎగిరిపోయేలా పాడతాడు)

యేలూరు సిన్నదానా
ఎత్తూ మడమలదానా
ఎత్తూ మడమలమీాద
యెండీ మువ్వలేదే
ఓసిన్నదానా! ఓసిన్నదానా?
యేవ్వూరు సిన్నదానా ?
యేపేరు సిన్నదానా ?
తై--తక--తా--ధిమితా!

ఆనంద్: (లేచి బిగ్గరగా) ఓ గాయక సార్వభౌమా యిక నీపాట ఆపుచెయ్యి.

దండ: నాపాట నచ్చిందా బాబూ ?

ఆనంద్: నీపాట, నీకంఠం, నీ అడుగు ఒకదానికొకటి అతుక్కుపోయినట్లు సరిపోయినై. ఇక వేగం వెళ్ళి కాఫీ తీసుకురా.

(దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు.)

దిన: (సిగరెట్టు గట్టిగా పీల్చి) నా నాటకంలోని నాయకుడు, యువకుడు, నిరుద్యోగి, తినడానికి తిండిలేని దరిద్రుడు.

ఆనంద్: నాటకాన్ని విషాదంతో నింపితే ప్రేక్షకులు భరించలేరు

దిన: జీవితంలోని విషాదాన్ని భరించ గలిగినవాళ్ళు నాటకంలో ఎందుకు భరించలేరు?

ఆనంద్: దానికి జవాబు నేను చెప్పలేను. కాని ప్రేక్షకుల అభిరుచికి సరిపోయే నాటకానికి ఎక్కువ ఆదరణ లభిస్తుంది.

దిన: ఆ అభిరుచు లెటువంటివి ?

ఆనంద్: కొంచెం ప్రణయం వుండాలి.

దిన: అప్సరసలవంటి ఆడపాత్రలను సృష్టించాలా ?

ఆనంద్: అంతేకాదు. హాస్యం కావాలి.

దిన: నేడు ప్రపంచంలో నలుమూలలా రౌద్ర భయానక భీభత్స దృశ్యాలు కనిపిస్తున్నాయి. వాటిమధ్య హాస్యం, శృంగారం నాట్యం చేస్తున్నై. కరుణరసం కంటికే కనిపించకుండా పారిపోయింది. హ హ్హా హ్హా! (నవ్వుతాడు.)

ఆనంద్: మళ్ళా మీరు పిచ్చిధోరణిలో పడుతున్నారు దినకర్.

(కుడివైపునుంచి దండపాణి ట్రేతో కాఫీ తీసుకు వస్తాడు)

దండ: (ఉత్సాహంతో) ఆ పాటలోని సెరణాలన్నీ పాడితే నా సామిరంగా! (కప్పులు యిద్దరికీ అందిస్తాడు )

దిన: (కాఫీతాగి ఖాళీకప్పు టేబిలుమీద పెడుతూ) సుడులు తిరిగి విరిగిపడే సముద్రపు కెరటంవంటిది మానవజీవితం. ఒక కెరటాన్ని మరో కెరటంవచ్చి కలుసుకొన్నట్లు ఒక మనిషిని మరో మనిషివచ్చి కలుసుకుంటాడు. దానితో యీ విచిత్ర నాటకానికి నాంది ప్రారంభమవుతుంది. వెన్నెల,

నవ్వులు, పువ్వులు, సంతోషం— ఆ తరవాత నిట్టూర్పులు ఏడుపులు, వికటాట్టహాసాలు, పాలలో నీరులా కనిపించ కుండా కలిసిపోతూ వుంటాయి.

ఆనంద్: (పుస్తకం దినకర్ చేతికి అందిస్తూ) ఇక ఆలస్యం చెయ్యకండి. ప్రారంభించండి.

దిన: (పుస్తకం తీసుకొని) నిరుపేదల గుండెలలో నిదురిస్తున్న ప్రతీకార కాంక్షను మేల్కొలపనా? సింహాన్ని బోనునుంచి విడుదల చెయ్యనా?

రంగ: (కుడివైపు చూసి తొందరగా) అయ్యగారు, అమ్మాయి గారు వస్తున్నారు. ఇంక వీరు మీ గదులలో కెళ్ళిపొండి బాబూ!

ఆనంద్: (దినకర్ తో) ఇక్కడ కూర్చుంటే ఎవరో ఒకరు వస్తూ వుంటారు. రండి. గదిలోకి పోదాం.

దిన: వస్తాను నేస్తం!
నేను నీతో

వస్తాను నేస్తం!
నల్లని నిరాశల
విషాదవలయం దాటి
తెల్లని శాంతిపురం
పొలిమేరలవరకూ
వస్తాను నేస్తం!

(ఆనంద్, దినకర్ ఎడమవైపు నిష్క్రమిస్తూవుండగా కుడివైపునుంచి వామనమూర్తి, చిత్ర వస్తారు. యిద్దరి చేతుల లోను పార్శిల్సు వున్నాయి. దండపాణి వారికెదురు వెళ్ళి పార్శిల్సు అందుకొని టేబిలుమీద పెడతాడు.)

వామన: (దండపాణితో) ఏవరూ రాలేదా?

దండ: లేదు బాబూ!

చిత్ర: మీరు వృథాగా తొందరపడ్డారు డాడీ! మన వాళ్ళకు పంక్చుయాలిటీ తెలీదని మీ కెన్నిసార్లు చెప్పాను.

వామ: దండపాణీ! మేడమీద సామాన్లు అన్నీ సరిగాసర్దావా?

దండ: అన్నీ ఎక్కడివక్కడ సర్దేశానండి.

వామ: ఈ పెళ్ళికొడుకు చాలా తమాషా అయిన మనిషి అని వాళ్ళనాన్న మాటలవల్ల తెలుస్తోంది. ఒకటి రెండురోజులు యిక్కడే వుండిపోతానని అన్నా అనవచ్చు. లేదా ఒక అరనిముషంలోనే తిరిగి వెళ్ళిపోవచ్చు.

చిత్ర: వెళితే వెళ్ళనివ్వండి. కొంపతీసి మీరు అతనిని బ్రతిమా లరు కదా డాడీ!

వామ: ఇంటికి వచ్చినవాళ్ళను మర్యాద చెయ్యవద్దటమ్మా!

చిత్ర: ఇటువంటి లేనిపోని మర్యాదలు చెయ్యడంవల్లనే యీ కాలపు అల్లుళ్ళకు కొమ్ములు మొలుస్తున్నాయి.

దండ: మా బాగా సెప్పారు అమ్మాయిగారు! నేను మొదటి మాటు మా అత్తోరింటికెళ్ళినప్పుడు మా మరదలు నా

వీపుమీద గరిట తిరగేసింది.

చిత్రి: (నవ్వుతూ) మంచిపని చేసింది. ఎంతటి చచ్చు పెద్దమ్మ అయినా అత్తవారింటిలో తల ఎగరేసుకు తిరుగుతాను. అటువంటివాళ్ళకు బుద్ధి చెప్పవలసిందే.

వామ: (కుడివైపుచూస్తూ) చూడమ్మా, ఎవరో వస్తున్నారు. అతనే పెళ్ళికొడుకు అనుకుంటాను.

చిత్రి: (అటుచూసి) కాదునాన్నా, అబ్బాయిని ఒక్కడినీ పంపించనన్నాడు కదూ వాళ్ళ నాన్న. పెళ్ళికొడుకయితే కూడా మరొకరిని తీసుకువచ్చును.

వామ: అవును. నువ్వు చెప్పింది నిజమే.

(కుడివైపునుంచి నిరంజన్ వస్తాడు. చిత్రివైపు రెప్ప వెయ్యకుండా చూస్తూ వుంటాడు.)

దండ: (నిరంజన్‌తో) దెయ్యం పట్టుకున్న మనిషిలాగ అలా చూస్తావేటయ్యా? ఏం కావాలి నీకు?

నిరంజన్: (తేరుకొని) వామనమూర్తిగారెవరు?

వామ: నేనే! ఎందుకు?

నిరం: ఆఁ!...మరి...(ఏంచెప్పాలో తోచక క్షణం ఆలోచించి చప్పున ఏదో స్ఫురణకు వచ్చినట్లు) అనంద్ ఎక్కడ వున్నాడో చెబుతారూ?

చిత్రి: (కోపంతో) ఆమాట ముందే అడగకూడదూ? ఇంత సస్పెన్స దేనికి?

నిరం: (చిత్రకేసి తిరిగి మీరు...యిక్కడ...లేడీ సైపిస్టా?

చిత్ర: (మరింతకోపంతో) నాన్సెన్సు! మేనర్సు తెలియవు.

దండ: (ఆశ్చర్యంతో) మేల్ నర్సు!!— అవునండి అమ్మాయి గారూ ఇతను అచ్చంగా మేల్ నర్సులా వున్నాడు. నేను మొన్న అస్పత్రికి వెళ్ళినప్పుడు చూశాను.

నిరం: ఆరవ నెంబరుగది ఎక్కడో చెబుతారూ?

వామ: (ఎడమవైపు చూపిస్తూ) అదుగో! అదే!

(నిరంజన్ ఎడమవైపు నిష్క్రమిస్తాడు.)

దండ: (దీర్ఘంగా ఆలోచిస్తూ) ఈయన ఆనందంగార్ని ఎందుకు అడిగాడు చెప్మా!

వామ: ఎందుకో అడిగాడులే! అతగాడిగోడన యిక మనకెందుకు వూరుకో?

చిత్ర: (రిస్టువాచీచూసి) అప్పుడే అరగంట దాటిపోయిందిడాడీ, యిక నేను పైకిపోయి చదువుకుంటాను.

వామ: మరో ఐదునిముషాలు కూర్చో. తొందరపడకు.

చిత్ర: దండపాణి. ఈ పార్శిల్సు నా గదిలో పెట్టిరా!

(దండపాణి టేబిలుమీదవున్న పార్శిల్సు మేడమీదికి తీసుకు వెడతాడు. చిత్ర పుస్తకం తెరచి సోఫాలో కూర్చుంటుంది. వామనమూర్తి హాలులో అటూ యిటూ తిరుగుతూ మధ్య మధ్య కుడివైపు పరికించి చూస్తూ వుంటాడు. మేడ మీదినుంచి దండపాణి తిరిగి వస్తాడు.)

వామ: (కుడివైపు పరికించి చూస్తూ) చూడమ్మా! చిత్రా, ఎవరో యిద్దరు యిలావస్తున్నారు:

చిత్ర: (లేచి తండ్రిని సమీపించి) అవును డాడీ! ఆ యిద్దరిలో పొడుగ్గావున్నవాడే పెళ్ళికొడుకు అయివుండవచ్చు:

దండ: (పరికించిచూస్తూ) అవునండి. అచ్చంగా పెళ్ళికొడుకు లాగే వున్నారు.

వామ: వాళ్ళతో కొంచెం మర్యాదగా మాట్లాడమ్మా! తొం దరపడకు.

(కుడివైపునుంచి కిశోర్, జయరాం ప్రవేశిస్తారు. యిద్దరి ముఖాలలోనూ నిరాశ తాండవిస్తోంది.)

వామ: (కిశోర్ జయరాంలకు ఎదురువెళ్ళి మర్యాదగా) రండి, కూర్చోండి.

(ఆహ్వానించడమే తడవుగా జయరాంవెళ్ళి సోఫాలో కూలబడతాడు. కిశోర్ సంశయంతో ముగ్గురికేసి చూస్తూ నిలబడతాడు.)

దండ: యింత ఆలస్యంగా వచ్చారేం బాబూ?

జయరాం: (సోఫాలో కదలకుండా కూర్చుని కోపంతో) ఆ ప్రశ్న వెయ్యడానికి నీకుగల హక్కేమిటో ముందు చెప్పు?

వామ: (జయరాంతో వినయంగా) ఏదో తెలియక అడిగాను. ఏమీ అనుకోకండి.

కిశోర్: వూళ్ళో పనులు చూసుకొని వచ్చేసరికి కొంచెం ఆలస్యం అయ్యిందిలెండి.

వామ: అలాగే మేమూ అనుకుంటున్నాం.

చిత్రి: పనులేమిటి? పనులు! ఎన్ని పనులున్నా టైం తప్ప కూడదు.

జయ: అయితే యీ రాత్రి యిక్కడ వుండటానికి మాకు గది దొరకదా?

వామ: (వినయంగా) ఎంతమాట! మీకు గదిలేకుండా చేస్తానా? (దండపాణితో) అలా నిలుచుని చూస్తావేం?

(దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు.)

కిశోర్: (హాలును పరిశీలించి చూస్తూ) ఈ ప్రదేశమంతా చాలా కొత్తగా వింతగా కనిపిస్తోంది.

వామ: అబ్బాయి! నువ్వు ఎప్పుడూ పట్నంలోనే వుంటావను కుంటాను.

కిశోర్: అవునండి. ఎప్పుడూ పట్నంలోనే వుంటాను. ఇక్కడికి రావలసిన అవసరం ఏముంది చెప్పండి?

చిత్రి: (కిశోర్‌తో) ఎంతవరకు చదువుకున్నారు మీరు?

కిశోర్: ఇంటర్మీడియట్ పాసయ్యానండి.

జయ: (లేచి ముందుకువచ్చి సంచి తెరుస్తూ) ఎందుకైనా మంచిది. యిదిగో! సర్టిఫికేట్లు చూడండి.

వాసు: అమ్మమ్మ! సర్టిఫికేట్లు చూడటం ఎందుకు? మీ మాటలమీద నమ్మకం లేదంటారా?

జయ: (సోఫాలో తిరిగి కూర్చుంటూ) ఈ రోజులలో ఎక్కడ చూచినా సర్టిఫికేట్లు అడిగేవాళ్ళే. కనీసం మీరైనా మా మాట మీద నమ్మకం వుంచినందుకు సంతోషిస్తున్నాం.

వాసు: మీరు గది కావాలన్నారు. ఇక్కడ రెండు రోజులు వుండే ఉద్దేశం ఏమైనా వుందా నాయనా? ఇలా అడిగేనని ఏమీ అనుకోకండి.

జయ: రెండురోజులేమిటి? కనీసం నాలుగు రోజులైనా వుంటాం.

వాసు. ఓ! అలాగే వుండండి. యిక్కడ మీకేవిధమైన లోటుపాట్లు జరగవు.

(కుడివైపు నుంచి దాసపాణి ట్రేలో కాఫీ బిస్కట్లు తీసుకు వస్తాడు. టేబిలుమీద నాలుగు కప్పులు, నాలుగు ప్లేట్లు పెట్టి సర్వ్ చేస్తాడు.)

జయ: (బిస్కట్లన్నీ క్షణంలో తిని కాఫీ తాగి, ఖాళీ కప్పు క్రింద పెడుతూ) మీరు చేసిన మర్యాదకు మేం చాలా సంతోషిస్తున్నాం.

కిశోర్: (చుట్టూ చూస్తూ) ఈ పరిసరాలు, ఈ ప్రశాంత వాతావరణం, మీరు చేస్తున్న మర్యాద— యివన్నీ చూస్తూ వుంటే యిక్కడ నాలుగు రోజులు నిశ్చింతగా గడపవచ్చు అనిపిస్తోంది.

వామ: అలాగే వుండండి. మీ యింట్లో జరిగినట్లే యిక్కడ మీకు అన్ని సదుపాయాలు జరుగుతాయి.

కిశోర్: మా యింట్లోకూడా యిటువంటి సౌకర్యాలు జరగనని మేం నిరభ్యంతరంగా ఒప్పుకుంటాం.

వామ: మర్యాదకోసం అలా అంటున్నారు కాని మీకేంలోటు? (కుడివైపు చూస్తూ) దండపాణి! దండపాణి! (దండపాణి వస్తాడు అతనితో) వీరికి గది చూపించిరా!

దండ: రండి. బాబూ!

(ముందు దండపాణి వెనుక కిశోర్, జయరాం ఎడమవైపు నిష్క్రమిస్తారు.)

వామ: (చిత్రతో) ఎలా వున్నావమ్మా అబ్బాయి ?

చిత్ర: చూపులకు బాగానే వున్నాడు. తెలివైనవాడు అవునో కాదో తెలియదు.

వామ: నువ్వు తొందరపడి మాట విసరకు సుమీ.

(ఎడమవైపునుంచి తిరిగి దండపాణి, కిశోర్ మాట్లాడుకుంటూ వస్తారు.)

దండ: వున్న గదులన్నింటిలోకీ అది ఒకటో నెంబరు గది బాబూ! అందుకే దాని నెంబరు కూడా ఒకటి.

వామ: ఏడీ? ఆ అబ్బాయి ఎక్కడ?

కిశోర్: వాడికి వంట్లో ఖులాసాగా లేదండి. పడుకున్నాడు. (సోఫాలో కూర్చుంటాడు.)

వామ: అయ్యో పాపం! ఏమైనా మందు కావాలా?

కిశోర్: ఏమీ అక్కర్లేదండి. కొంతసేపు విశ్రాంతి తీసుకుంటే అదే పోతుంది.

వామ: (లేచి) అమ్మాయి నేను ఎకౌంట్సు చూసుకొని యిప్పుడే వస్తాను. ఈ లోపున అబ్బాయికి మేడమీది గదులు ఫోటో ఆల్బం వగైరా చూపించు (ముందు వామనమూర్తి వెనుక దండపాణి కుడివైపు నిష్క్రమిస్తారు. హాలులో చిత్ర, కిశోర్ యిద్దరే మిగులుతారు.)

చిత్ర: (లేచి) నేను మిమ్మల్ని కొంచెం పరీక్ష చెయ్యవలసివుంది

కిశోర్: (ఆశ్చర్యంతో) పరీక్షా? ఎందుకు?

చిత్ర: (కోపంతో) ఇంతకాలం పురుషులు స్త్రీలపట్ల నిరంకుశత్వంతో ప్రవర్తించారు. పెళ్ళికిముందు ఆడదాని యిష్టాయిష్టాలను మీ మగవాళ్ళు గమనించలేదు. పెళ్ళికూతురును రకరకాల పరీక్షలకు గురిచేసి— ఆమెను అవమానించి విడిచిపెట్టారు. ఇప్పుడలాకాదు. కాలం మారింది.

కిశోర్: మీరు చెబుతున్నది నాకు బోధపడటంలేదు. అంతా అయోమయంగా వుంది.

చిత్ర: (కోపంతో) ఎలా బోధపడుతుంది? విశృంఖల విహారం చేసేవాళ్ళకు యిలాంటి విషయాలు బోధపడవు. బోధపడక పోయినా బాధలేదు. నేను వేసే ప్రశ్నలకు జవాబులు చెప్పండి.

కిశోర్: ప్రశ్నలకు జవాబులు చెప్పడానికి నేనెన్నడూ వెనుకాడను. నేను కాలేజీ విడిచిపెట్టినతరవాత హిందుస్థాన్ ఇయర్ బుక్, జనరల్ నాలెడ్జి, డిస్కవరీ ఆఫ్ ఇండియా మొదలైన పుస్తకాలు ఎన్నో చదివాను. యుద్ధానికి సిద్ధమైన సిపాయిలా ఇంటర్వ్యూలో అడిగే ఏ ప్రశ్నకు జవాబు చెప్పడానికి సిద్ధంగా వున్నాను. ఇంతకూ మీరు ప్రశ్నలు వెయ్యడంలోగల ఆంతర్యం నాకు బోధపడకుండా వుంది.

చిత్ర: మీరు వృధా ప్రసంగంలో టైం వేస్టుచెయ్యడానికి వీల్లేదు. ముందు నా ప్రశ్నలకు జవాబు చెప్పండి.

కిశోర్: (వినయంగా) సరే! అడగండి. ఇంతకూ మీరు యివ్వబోయే ఉద్యోగపు స్వరూపం యేమిటో నాకు తెలియకుండా వుంది.

చిత్ర: తొందర దేనికి? ఇప్పుడే తెలుస్తుంది. ఇక పరీక్ష ప్రారంభిస్తాను. (క్షణం ఆగి) మీకు భావకవిత్వం వచ్చునా?

కిశోర్: అద్భుతమైన ప్రశ్న వేశారు. ఇంతవరకూ ఎవరూ నన్ను యిటువంటి ప్రశ్న అడగలేదు.

చిత్ర: (కోపంతో) మీరు కబుర్లతో కాలం గడుపుతున్నారు. అదేం లాభం లేదు. అడిగిన ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పాలి.కిశోర్: (సూటిగా) నాకు భావకవిత్వం వచ్చును.

చిత్ర: వచ్చును అంటే సరిపోదు. ఉదాహరణ కావాలి.

కిశోర్: (ఆలోచిస్తూ)

నల్లని సిరాలాంటి రాత్రిలో
తెల్లని గులాబీలాంటి సుందరి
మెల మెల్లగా మంచు బిందువులా
గలగలా పారు సెలయేరులా
నా గ క న్న క వ లె
సా గి పో తు ం ది

చిత్ర: అంత సంతృప్తికరంగా లేదు. మీకు చిత్రలేఖనంవచ్చునా?

కిశోర్: వచ్చును. నేను పిల్లిబొమ్మ వేసినప్పుడు మా టీచర్ ఆ బొమ్మకింద 'పిల్లి' అని రాయమనేవారు.

చిత్ర: ఎందుకూ?

కిశోర్: చూసేవాళ్ళు పోల్చుకునేందుకు యిబ్బంది పడతారని.

చిత్ర: అయినా మీకు చిత్రలేఖనం రాదని తేలిపోయింది. పోనీ కూడికలు, భాగాలు, తీసివేతలతో కూడిన లెక్కలు వచ్చునా?

శోర్: వచ్చును. ఎటువంటి లెక్కలయినా క్షణంలో చేస్తాను.

చిత్రి: (ముందుకు నడుస్తూ) నాతో మేడమీదికి రండి. నా లెక్కల పుస్తకాలు పైన వున్నాయి.

కిశోర్: (నిస్పృహతో ఆమె వెనుక నడుస్తూ) ఈ ప్రశాంత సంధ్యాసమయాన్ని లెక్కలుచేస్తూ వ్యర్థం చెయ్యావలసిం దేనా? నాకు లెక్కలు చెప్పిన ఓ గురుదేవా! మీరు యిప్పుడు ఏ క్లబ్బులో పేకాడుతున్నారో కదా!

(ముందు చిత్రి, వెనుక కిశోర్, మేడమీదికి వెళ్ళిపోతారు.)

జయరాం: (నేపథ్యంలోంచి) కిశోర్! కిశోర్! (ఎడమవైపు నుంచి వస్తాడు. ఎవరూ లేకపోవడం చూసి నిస్పృహతో సోఫాలో కూర్చుంటాడు.)

ఆనంద్: (నేపథ్యంలోంచి) దండపాణీ! దండపాణీ! (ఎడమవైపు నుంచి వస్తాడు. జయరాంను చూసి) అయ్యా! తమరెవరు?

జయ. అదే తెలియకుండావుంది. ఏదో ఒకటి తేల్చుకునే ఉద్దేశంతోనే యిక్కడకు వచ్చాను.

ఆనంద్: అనగా తమభావం?

జయ: భావానికేముందయ్యా మహానుభావా! నే నెవరినో యింకా తేలలేదు. కొంతలో తప్పిపోయిందికాని లేకపోతే యీపాటికి ఒకకంపెనీకి ఏజంటునై వుండేవాణ్ణి. ఇకముందు నేను ఏజంటునౌతానో, యాక్టరునౌతానో; కాఫీ హోటలులో సర్వరునౌతానో; కారు కండక్టరు నవుతానో తెలియకుండావుంది.

ఆనంద్: ప్రస్తుతం నిరుద్యోగులన్నమాట. (జయరాంను పరిశీలించి చూసి) మిమ్మల్ని యిదివరకు ఎక్కడో చూసినట్లుందిదే!

జయ: సినిమాహాలు గేటుదగ్గరకానీ, రైల్వే ప్లాట్ ఫారంమీద కాని ఎక్కడైనా నన్ను చూసి వుండవచ్చు.

ఆనంద్: మీపేరు?

జయ: జయరాం.

ఆనంద్: జయరాంకంటే జై సీతారాం అంటే శాస్త్ర యుక్తంగా వుండేది.

జయ: మా వివరాలన్నీ తమరి కెందుకో తెలుసుకోవచ్చునా?

ఆనంద్: ఓ! తెలుసుకోవచ్చును. మా నాటక కంపెనీకి నటులను రిక్రూట్ చేసుకుంటున్నాం. మీ ముఖంలో కొంచెం నటుని లక్షణాలు కనుపించినై: వెంటనే రెండు ప్రశ్నలు వేశాను. అంతే!

జయ: ఇదివరకు ఎప్పుడూ నేను నాటకాలలో వేషాలు వెయ్యలేదే!

ఆనంద్: వెయ్యకపోయినా ఫరవాలేదు.

జయ: జీతం ఎంత యిస్తారు.

ఆనంద్: చావకుండా బ్రతికేందుకు సరిపోయేజీతం యిస్తాం.

జయ: (సంతోషంతో) అయితే నాకీ ఉద్యోగం పూర్తిగా

నచ్చింది. యీ రోజులలో అంతకంటే ఎక్కువజీతం ప్రజా ప్రభుత్వంకూడా యివ్వడంలేదు.

ఆనంద్: (లేచి) ఇవ్వాళనుంచే మీరు ఉద్యోగంలో చేరతారా?

జయ: (లేచి) మహా రాజులా!

ఆనంద్: (ఎడమవైపు చూపిస్తూ) అదే మా ఆఫీసు గది, ఈ హాలును రిహార్సల్సు కోసం యిప్పుడే బుక్ చేశాం.

(ఇద్దరూ ఎడమవైపు మాట్లాడుకుంటూ నిష్క్రమిస్తారు — మేడమీదినుంచి కిలకిల నవ్వుతూ ముందు చిత్ర, వెనుక కిశోర్ ప్రవేశిస్తారు.)

చిత్ర: ఇప్పటికే మీరు రెండుపరీక్షలలో గెలిచారు. ఒక పరీక్షలో ఓడిపోయారు.

కిశోర్: ఇంతేనా? యింకా ఏమైనా పరీక్షలున్నాయా ?

చిత్ర: ఇంతటితో అయిపోయిందని సంతోషిస్తున్నట్లున్నారు. ముఖ్యమైన పరీక్ష ముందు వుంది — సిగ్గుపడుతున్న అమాయకురాలైన పెళ్ళికూతురుతో బలవంతంగా పాటలు పాడించేవారు. దానికిప్పుడు మేం ప్రతీకారం చేసితీరాలి.

కిశోర్: తరతరాలుగా మగవాళ్ళు చేస్తున్న దౌర్జన్యాలకు నేను యీ నాడు సంజాయిషీ యిచ్చుకోవలసి వచ్చిందికదా!

చిత్ర: (సూటిగా) మీకు పెళ్ళిసంగీతం వచ్చునా?

కిశోర్: పెళ్ళిసంగీతం అంటూ వేరే నేర్చుకోలేదు. కాని పాటలు పాడడం వచ్చునండి.

చిత్ర: దానినే పెళ్ళిసంగీతం అనవచ్చు ఫరవాలేదు. యేదీ ఒక పాటపాడి వినిపించండి.

కిశోర్: మీకు నచ్చేపాట పాడమంటారా? నాకు యిష్టమైన పాట పాడమంటారా?

చిత్ర: అది ఒకటి యిది ఒకటి— రెండూ పాడి వినిపించండి.

కిశోర్: మీకు ఎటువంటి పాటకావాలో ముందు చెప్పండి.

చిత్ర: ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించే పాట కావాలి.

కిశోర్: (క్షణం ఆగి గొంతు సరిచేసుకొని పాడడం ప్రారంభిస్తాడు.)

(పాట):—

అందాల దీవిలోను
చందమామ వెలుగులోను
అందం వెతికేదానా
అందమైన చిన్నదానా!
సంపెంగ పువ్వు చూడు
సన్నజాజితావి చూడు
చిరుమల్లె పువ్వు చూడు
చిన్నదాని మోము చూడు
నీలాల నింగి చూడు
నింగిమీది మబ్బు చూడు
మబ్బులోని మెరుపు చూడు

మెరుపులోని సొగసు చూడు!!

చిత్ర: (సంతోషంతో) సెహభాష్, చాలాబాగుంది. మీరు యింతబాగా పాడతారనుకోలేదు—— యిక మీకు యిష్టమైన పాట మరొకటి పాడవలసివుంది.

కిశోర్: యీ పాటతో యిక నా పరీక్ష అయిపోతుందా అండీ?

చిత్ర: చాలావరకూ అయినట్లే అనుకోవచ్చు. మొదటిపాటకంటే యీ పాట చాలాబాగా పాడితే యిక పరీక్ష పూర్తి అయిపోతుంది.

కిశోర్: (గొంతు సవరించి హాలు ప్రతిధ్వనించేలా బిగ్గరగా రాగంతీసి పాడతాడు.)

పూదోటలలో
తిరిగేదానా!
పూబాటలలో
నడిచేదానా!
లోకం పోకడ
తెలియనిదానా!
లోకపు వింతలు
చూడనిదానా!
దారినిపోయే
మనిషిని చూడు
వాని ముఖంలో

దైన్యం చూడు
కడుపులో లేచే
ఆకలిజ్వాలా
ఎదలో యేదో
తెలియని బాధా !!
యింటిలో చూస్తే
పిల్లల గోల
బయటకు వస్తే
బాకీలవాళ్ళు
నూతిలో దిగితే
పోలీసు కేసు
చావాలన్నా
చావగలేదు
బ్రతికాలంటే
బాధలు తప్పవు !!

(పాటమధ్యలో ఎడమవైపునుంచి తొందరగా నిరంజన్ ఆనంద్ వచ్చి పాటవింటూ నిలుచుంటారు.)

నిరంజన్: పాట (పూర్తికాగానే కిశోర్‌ను సమీపించి) మీ నటన అత్యద్భుతంగా, అతి సహజంగా వుంది. (పర్సులోంచి నోటుతీసి) మిమ్మల్ని మా నాటకంలో హీరోగా బుక్ చేశాం. ఇదిగో! పందరూపాయలనోటు అడ్వాన్సు! ఇక

నా మాటకు ఎదురుచెప్పకండి. (నోటు బలవంతంగా కిశోర్ జేబులో పెడతాడు.)

కిశోర్: ఎదురుచెప్పను. ఎంతమాత్రం ఎదురుచెప్పను. నాకు కావలసింది ఉద్యోగం. అందుకోసమే తిరుగుతున్నాను.

చిత్ర: యిటువంటి ఉద్యోగానికి మీరెందుకు అంగీకరిస్తున్నారు?

నిరం: (రెండుజేబులలోను చేతులు పెట్టుకొని ఆమె ముఖంలోకి ఓరగా చూస్తూ) మీకేం అభ్యంతరం లేకపోతే మిమ్మల్ని కూడా మా నాటకంలో నాయిక పాత్రకు బుక్ చేస్తాం.

చిత్ర: (కోపంతో)ఏవూరు నీది? వాళ్ళు దగ్గర పెట్టుకు మాట్లాడు (సీరియస్‌గా మేడమీదికి వెళ్ళిపోతుంది.)

ఆనంద్: నిరంజన్! కొంపముంచావ్! ఆమె ఎవరనుకుంటున్నావు? వామనమూర్తిగారి అమ్మాయి!

నిరం: ఓహో! అలాగా! నేనామెను టైపిస్టు అనుకుంటున్నాను. పోనీలే! నాటకంలో వేషంవెయ్యమనడం పెద్ద అపరాధం యేమీకాదు.

కిశోర్: మీ నాటకమండలి ఎక్కడ?

నిరం: ప్రస్తుతం యీ విశ్రాంతి భవనంలోనే!— ప్రయాస లేకుండా మీరు మా నాటకానికి హీరోగా దొరికినందుకు చాలా సంతోషిస్తున్నాం.

ఆనంద్: మీనాన్నగారు పెట్టిన ముహూర్తం చాలామంచిదిలా

కనిపిస్తోంది. తలపెట్టిన కార్యం చాలావరకూ పూర్తి అయ్యింది.

నిరం: ఇక నేను యింటికివెళ్ళి డబ్బు తీసుకువస్తాను. కవిగారితో తెల్లవారేసరికి నాటకం పూర్తిచేయించు. రేపే రీహార్సల్సు ప్రారంభిద్దాం.

(నిరంజన్ తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు.)

ఆనంద్: (కిశోర్‌తో) రండి. మా ఆఫీసు రూంలో కూర్చుని మాట్లాడదాం.

కిశోర్: (ఏదో స్ఫురణకు వచ్చినట్లు) మీరు వెళ్ళండి. నేను తరవాత వస్తాను.

(కిశోర్ తొందరగా మేడమెట్లు ఎక్కుతూ వుంటాడు. ఆనంద్ అతనికేసి చూస్తూవుంటాడు— [తెర.

# నీ లి తె ర లు

## [ నాల్గవ అంకం ]

( స్థలం :— అదే సమయం. రాత్రి 7 గంటలు. వామనమూర్తి కుర్చీలో కూర్చుని పేపరు చదువుతూ వుంటాడు. కుడివైపునుంచి దామోదరం వస్తాడు.)

వామన: (సంతోషంతో) రండి. దామోదరంగారూ, మీకోసమే

ఎదురు చూస్తున్నాను.

దామో: (ఆతురతతో) ఏమయ్యింది? అసలు మా అబ్బాయి వచ్చాడా?

వామ: (ఉత్సాహంతో) వచ్చాడండీ, వచ్చాడు. చాలా హుషారైన కుర్రాడు.

దామో: వాళ్ళిద్దరూ యిష్టపడ్డారా?

వామ: మా చిత్ర మీవాడితో పెళ్ళి సంగీతం కూడా పాడించిందండి. మీవాడుఎంత అద్భుతంగా పాడాడనుకున్నారు!

దామో: (ఆశ్చర్యంతో) మా వాడికి పాటలు పాడడం వచ్చినట్లు నాకు తెలియదే!

వామ: పాడడం వచ్చినంతమాత్రాన మీ ముందు పాడుతూ కూర్చుంటాడటండీ! అంతేకాదు మా అమ్మాయి మీ వాడితో లెఖ్కలుకూడా చేయించింది.

దామో: వాడికి లెఖ్కలు అసలు రావు.

వామ: అదేమిటి? అలా అంటారు! యిచ్చిన నాలుగు లెఖ్కలు క్షణంలో చేసిపారేశాడు.

దామో: యిది నాకు మరీ వింతగావుంది. వాడికి లెఖ్కల పరీక్షలో నూటికి పది మార్కులే వస్తూవుండేవి. అటువంటిది వాడు యిక్కడ యింత అద్భుతంగా ఎలా చేశాడో నాకు అర్థం కావడంలేదు.

వామ: తరవాత మీవాడికి చిత్రలేఖనం అసలు చేతకాదు.

దామో: నాకు తెలిసినంతవరకూ మా వాడికి చేతనైన విద్య బొమ్మలు వెయ్యడం ఒక్కటే, చిన్నప్పుడు వాడు మసి బొగ్గుతో గోడలనిండా బొమ్మలు వేస్తూవుండేవాడు.

వామ: కాని మా అమ్మాయి సమక్షంలో ఒక బొమ్మకూడా గియ్య లేకపోయాడు— ఏమైతేనేం చివరకు మా అమ్మాయికి మీవాడు పూర్తిగా నచ్చాడు.

దామో: అయితే మరి మా అబ్బాయికి మీ అమ్మాయి నచ్చిందా?

వామ: (తేలికగా) నచ్చ కేంచేస్తుందండీ! మహారాజులా నచ్చుతుంది.

దామో: అబ్బే! అలా అనడానికి వీలులేదండోయ్. వాడికి నచ్చకపోతేమాత్రం మనం ఏమీచెయ్యలేం. అసలు మీరు కనుక్కున్నారా మా వాణ్ణి?

వామ: ఊహూ! నే నేమీ అడగలేదు. కాని మీ వాడి వాలకాన్నిబట్టి చూస్తే యిష్టపడినట్లే కనిపిస్తోంది.

దామో: అలా అనుకోడానికి వీల్లేదండి. వాడు విచిత్రమైన మనిషి. వాడిని ఒకసారి పిలవండి—యిప్పుడే తెలుసుకుందాం.

వామ: (మేడమీదికిచూస్తూ) దండపాణి! దండపాణి!

చిత్ర: (మేడమెట్లమీద కనిపించి) లేదు డాడీ? దండపాణికి యీపూట మీరు సెలవిచ్చారట కదూ!

వామ: అవునవును. పోనీ పెళ్ళికొడుకును యిలా రమ్మను వాళ్ళ నాన్న వచ్చారు. మాట్లాడతారు.

చిత్ర: లేరు డాడీ! దండపాణి ఆయనా కలిసిఏదో నాటకం అను కుంటూ వెళ్ళిపోయారు. ఒక గంటలో తిరిగి వస్తారు.

దామో: (లేచి) నేను ఒక గంటలో మళ్ళీ వస్తాను వామన మూర్తిగారు!

వామ: పోనీ యిక్కడే కూర్చోకూడదూ!

దామో: లేదండీ! ముఖ్యమైన పని ఒకటి వుంది. అది చూసుకు వచ్చేసరికి గంట ఎలాగూ అవుతుంది. వస్తాను. (కుడివైపు నిష్క్రమిస్తాడు.)

చిత్ర: బ్రెడ్ యిక్కడకు తీసుకురానా డాడి?

వామ: వద్దమ్మా! నేనే పైకే వస్తాను.

(చిత్ర) మేడమీదికి వెళ్ళిపోతుంది. వామనమూర్తిగారు నెమ్మదిగా మేడమెట్లు ఎక్కి పైకి వెడతారు. ఆకస్మికంగా హాలులో దీపాలు ఆరిపోతాయి. గాఢాంధకారం ఆవరిస్తుంది.)

దినకర్: (మాటలు వినిపిస్తాయి. మనిషి కనిపించడు.) కాలచక్రం తిరుగుతోంది. తిరిగి తిరిగి ఉజ్వల తేజస్సుదాటి గాఢాంధ కారంలోకి వచ్చింది. సామాన్య మానవుని సుఖం, శాంతి, అనుభూతులు, కోర్కెలు సమస్తం చీకటిలో చిక్కుకు

పోయినై. అంధకారంలో అణగివున్న సుఖాన్ని శాంతిని పట్టుకోవాలి. వాటిని వెలుగులోకి తీసుకురావాలి! మనిషీ! యికలే! నడుం బిగించు. ఆలస్యం చెయ్యకు.

(ఆకస్మికంగా హాలులో నీలికాంతి ప్రసరిస్తుంది. హాలు మధ్య ఒక సోఫామాత్రమే వుంది. నిరంజన్ చక్కగా అలంకరించుకొని సోఫాలో కూర్చుని వున్నాడు. అతని ముఖంలో కోపం, అసహనం కనిపిస్తున్నాయి.)

ఆనంద్: (సేవకుని వేషంలో ప్రవేశించి) ప్రభూ! ఆ ముసలి వాడు తిరిగి వచ్చాడు.

నిరం: (లేచి ఉగ్రుడై) ఎందుకు? ఆ ముసలిదెయ్యం మళ్ళీ ఎందుకు వచ్చాడు?

ఆనంద్: (వినయంగా) మిమ్మల్ని చూడాలంటున్నాడు బాబూ! వెళ్ళిపొమ్మని ఎంతచెప్పినా వినడంలేదు.

నిరం: ఆ ముసలిపీనుగను వెంటనే ప్రవేశపెట్టు. అంతవరకూ వాడు నన్ను వదలడు. ఊఁ! వెళ్ళు!

(ఆనంద్ నిష్క్రమిస్తాడు. ఉద్వేగంతో హాలులో తిరుగుతూవుంటాడు నిరంజన్. చిరిగిన బట్టలతో, చిక్కిన దేహంతో తెల్లబడిన కేశాలతో; వణుకుతూ ఒక ముసలివాడు ప్రవేశిస్తాడు.)

వృద్ధుడు: (గద్గదస్వరంతో) చిన్నబాబూ!

నిరం: (కోపంతో) నువ్వు మమ్మల్ని వదల దలుచుకోలేదా?

వృద్ధు: ఎలా వదలగలను చిన్నబాబూ!—నాలోని యౌవనాన్ని రక్తమాంసాలను మీ సేవలో హరింపచేసుకున్నాను.

నిరం: నిన్ను సేవకవృత్తిలోకి రమ్మని ఎవరైనా బ్రతిమాలారా? హాయిగా అంతఃపురంలో కూర్చోలేకపోయావ్రా?

వృద్ధు: లేదు బాబూ! విధి అందరినీ సుఖపడడానికి సృష్టించ లేదు. నాలాంటి వాళ్ళకు విధి ప్రతికూలించి కంటకావృత మైన మార్గాన్ని ప్రసాదించింది.

నిరం: యిక నన్ను వృథాగా విసిగించకు. వెళ్ళు.

వృద్ధు: మావంటి దీనులమీద దయ చూపించాలి చినబాబూ!

నిరం: (కోపంతో) మీరు కేవలం దీనులే కాదు. హీనులు. తిన్నయింటికే వాసాలు లెక్కపెట్టే నీచాతి నీచులు!

వృద్ధు: కుర్రవాడు చేసిన పొరపాటుకు నన్ను శిక్షించడం ధర్మమా?

నిరం: (హేళనగా) కుర్రవాడు!... పొరబాటు!... హ హ్హాహ్హా! వాడిని చిత్రవధ చేసినా పాపంలేదు.

వృద్ధు నా ముఖం చూడండి చిన్నబాబూ: నేను పదేళ్ళ పిల్ల వాడిగా వున్నప్పుడు మీ తాతగారిదగ్గర నౌఖరుగా చేరాను. ఆయన జీవితకాలం......

నిరం: (మధ్యలో అందుకొని కోపంతో) ఆ గడిచిపోయిన గాథ లతో నన్ను విసిగించకు!

వృద్ధు: (ప్రార్థనా పూర్వకంగా) నా మొర వినండి చినబాబూ! నన్నీ ముసలి వయస్సులో ప్రశాంతంగా ప్రాణాలు వదల నివ్వండి బాబూ!

నిరం: నువ్వు ప్రాణాలు వదిలితే ప్రపంచానికేమీ నష్టంరాదు. యికపో.

వృద్ధు: నా జీవనయాత్రలో యాభై సంవత్సరాలు పూర్తిగా మీసేవకే అంకితం చేసాను.

నిరం: అందుకు నీకిప్పుడు నష్టపరిహారం కావాలంటావా ?

వృద్ధు: వద్దుబాబూ! నష్టపరిహారం ఏమీవద్దు. నన్ను తిరిగి మీ కొలువులోకి తీసుకోండి అంతేచాలు.

నిరం: నువ్వు నాదగ్గర వుండడానికి ఎంత మాత్రం పనికిరావు.

వృద్ధు: (నిరంజన్ కాళ్ళు పట్టుకొని) బాబూ! కనికరించండి! నానోటి దగ్గర తిండి పడగొట్టకండి, నా నలుగురు బిడ్డలు తిండిలేక ఆకలితో మాడి చస్తూవుంటే చూడలేనుబాబూ! యీ వృద్ధాప్యంలో నన్ను ఏడిపించకండి. నా కొడుకుకు ఉద్యోగం దొరికేవరకైనా......

నిరం: (కోపంతో ముసలివాణ్ణి విదలించి) ఛీ! వాడిమాట నా దగ్గర ఎత్తకు. వాడు ద్రోహి! దుర్మార్గుడు!

వృద్ధు: బాబూ! జరిగిపోయిన సంగటనలుఒకసారి జ్ఞప్తికి తెచ్చు కొండి. మీ తండ్రిగారు మీతోపాటు నా కొడుకును కూడా చదివించి పెంచి పెద్ద చేశారు.

నిరం: అవును! పామును పాలు పోసి పెంచారు!

వృద్ధు: వాడు ఎప్పుడూ మీకనుసన్నలలో మెలగేవాడు.

నిరం: అవును. మొదటిలో అలాగే జరిగింది. చివరకు నాకు నిలువునా ద్రోహం తలపెట్టాడు. చిన్నప్పటినుంచి యింటిలో వుంటూ అమాయకురాలైన విమలను మోసం చేశాడు. నాఆస్తిని పంచుకోవడానికి కుట్ర పన్నాడు. వానిని నిలువునా చీల్చినా పాపం లేదు.

వృద్ధు: శాంతించండి చిన్నబాబూ! ఒకవైపునుంచి చూస్తే న్యాయం కనిపించదు రెండువైపులనుంచి చూడండి. న్యాయాన్యాయాలను నిర్ణయించండి. నాకొడుకు నిర్దోషి అని......

నిరం: (కోపం పట్టలేక బలంకొద్దీ ముసలివాణ్ణి కొట్టి)నోర్మూయ్!

వృద్ధు: (చెక్కిలిని చేతితో పట్టుకొని) ఏభై సంవత్సరాల నిష్కల్మష సేవకు యిది ప్రతిఫలం!— కళ్ళు పూర్తిగా తెరవని యవ్వనంలో వున్నావు చిన్నబాబూ! యిక నిన్ను దేవుడే రక్షించాలి. వస్తాను చినబాబూ!

(వృద్ధుడు దైన్యంతో నిష్క్రమిస్తూ వుండగా రంగస్థలాన్ని తిరిగి అంధకారం ఆవరిస్తుంది.)

దినకర్: (ప్రశాంతస్వరంతో) మానవుడా! జీవితంలో నువ్వు పూర్తిగా మోసపోయావు. జీవితయాత్రలో అడుగడుకు నీకు నీలితెరలు అడ్డువస్తూ వున్నాయ్. వాటిని తప్పించు

కొని ముందుకు పోతున్నావు. అలా ఎంతకాలం నిర్విరామంగా పోగలవు మనిషీ? నేటికి నీవు అలిసిపోయావు. చిరంజీవి మానవుడా నీకు యీ రంగస్థలం నుంచి నిష్క్రమించే సమయం ఆసన్నమయ్యింది. యిక నీ ముందు కన్నుపొడుచుకున్నా కానరాని గాఢాంధకారం. నీచుట్టూ దట్టమైన నీలి తె ర లు.

(హాలులో మసక వెలుతురు కనిపిస్తుంది. ఆ వెలుగులో చిత్తచాంచల్యంతో తిరుగుతున్న నిరంజన్ అతని వెనుక నీడలా తిరిగే నల్లటి మానవాకారం అస్పష్టంగా కనిపిస్తారు. నిరంజన్ఎటు కదిలితే నల్లటి నీడవంటి మనిషికూడా అటే కదులుతున్నాడు. అతను ఆగితే నీడకూడా ఆగుతోంది.)

నిరం: (కోపంతో బిగ్గరగా) ఎవరు నువ్వు? ఎందుకు నావెనుక తిరుగుతున్నావ్? (జవాబు రాకపోవడం చూసి మరింత కోపంతో) మాట్లాడవేం? నన్ను నీడవలె వెన్నంటుతున్న నువ్వు ఎవరవు?

కిశోర్: (ఆకస్మికంగా నిరంజన్ ముందు కనిపించి) అతడు యమధర్మరాజు. నువ్వు చేసిన దుర్మార్గాలకు, దురంతాలకు అతడు ప్రత్యక్షసాక్షి.

నిరం: (హేళనగా) యమధర్మరాజు!! (కిశోర్ వైపు కళ్ళెర్రజేసి చూస్తూ) నువ్వు యిలా రావడానికి కారణం?

కిశోర్: (బాధగా) నాతండ్రిని-తన జీవిత సర్వస్వం మీ సేవకు

అంకితం చేసిన నాముసలితండ్రిని-శిక్షించడానికి కారణం?

నిరం: నాసేవకుని శిక్షించేహక్కు నాకు వుంది.

కిశోర్: నాతండ్రి పరాభవానిక ప్రతీకారం తీర్చుకొనే హక్కు నాకు వుంది.

నిరం: కష్టాలను కౌగలించుకోవడానికి ముచ్చటపడుతున్నావా?

కిశోర్: కష్టసముద్రంలో నిర్విరామంగా ప్రయాణం సాగించే మనిషి కొత్తకష్టాలకు వెరుకాడవు.

నిరం: వృథాప్రసంగం కట్టిపెట్టి మర్యాదగా నువ్వు వచ్చిన దారినే వెళ్ళు.

కిశోర్: నేను వచ్చినదారి అప్పుడే మూసుకుబడినది. యికనేను తిరిగి పోవడానికి దారిలేదు.

నిరం: చివరకు యీ పద్మవ్యూహంలో చిక్కుకున్నావ్. యిక నీవు జీవితాశ వదులుకోవలసి వుంటుంది.

కిశోర్: (హేళనగా) జీవితాశ!-అది ఏనాడో వదులుకున్నాను. నామాటకేం, నిన్ను నీవు పరిశీలించి చూసుకో. నీ వెనుక దండధరుడు పొంచివున్నాడు. నీపాపాలకు శాశ్వతపరిష్కారాన్ని అతడు ప్రసాదించగలడు.

నిరం: నువ్వు నాసేవకుని కొడుకువై వుండే నీతలకుమించి మాట్లాడుతున్నావ్.

కిశోర్: నువ్వు నిర్మించుకున్న సమాజంలో యజమానికి సేవకునికి

విభేదం వుండవచ్చు. మృత్యువు కౌగలిలో మాత్రం యిద్దరికి ఎట్టి భేదమూ లేదు.

నిరం: యింతవరకూ నీ నేరాలను నేను క్షమిస్తూ వచ్చాను. యిక నీ దుండగాలు...

కిశోర్: (మధ్యలో అందుకుని) ఏమిటా నేరాలు?

నిరం: బాల్యంనుంచి మాయింటిలో వుంటూ నాకు తీరని ద్రోహం తలపెట్టావు.

కిశోర్: అక్కడే పొరబాటు పడుతున్నావు. ప్రమాదాన్ని ముందే గుర్తించి మీ యిల్లు విడిచిపోయాను— సమాజంలో నాకువున్న స్థానం ఎటువంటిదో నాకు తెలుసు. మీరు వుంటున్న అంతస్థువైపు కనీసం చూడడానికైనా నాకు అర్హతలేదు!

నిరం: ఇప్పటికైనా నువ్వు కళ్ళు తెరచినందుకు సంతోషిస్తున్నాను.

కిశోర్: నేను ఏనాడో కళ్ళు తెరిచాను. నువ్వు యీ నాటికీ కళ్ళు మూసుకొని కూర్చున్నావు.

నిరం: (కోపంతో) నాలోని క్రోధాగ్నిని రగిలించకు. ఇక వెళ్ళిపో? నా కంటికి తిరిగి కనిపించకు!

కిశోర్: కేవలం మీ దాస్యం కోసం. మీ సంతృప్తి కోసం నాలోని కోరికలను, ఆశలను ఇంతవరకూ చంపుకున్నాను.

ఇంకా నీకు తృప్తి కలగలేదా? ఇక వెళ్ళిపొమ్మంటావా? జీవితంనుంచి నన్ను నిష్క్రమించమంటావా? నీ ఆనందం కోసం......

నిరం: (అసహనంతో) ఇక ఆపుచెయ్యి! ఈ ప్రశాంతమైన రాత్రిని......

కిశోర్: (మధ్యలో అందుకొని ఆవేశంతో) ప్రశాంతమైన రాత్రి!! నీవంటి పెట్టిపుట్టినవాళ్ళకది ప్రశాంతమైన రాత్రి. నావంటి గర్భదరిద్రుల పాలిటికాళరాత్రి ఇది నాజీవితం...

నిరం: (మధ్యలో అందుకొని) ధనవంతులమీాది అసూయను చంపుకో!

కిశోర్: దరిద్రులపట్ల గల నిరసనభావాన్ని తొలగించుకో?

నిరం: (కోపంతో) నాలోని అసహనాన్ని రెచ్చగొట్టకు.

కిశోర్: ఆదినుంచీ నీలోని అసహనం పడగ విప్పుకొని ఆడు తోంది. అది మాబోటి అభాగ్యుల నెందరినో తన విషపు కోరలతో గాయపరచింది. ఇంకా దానికి తృప్తి కలగలేదు. ముందుకు......

నిరం: (కోపంతో మైమరచి కుర్చీని రెండు చేతులతో పైకెత్తి కిశోర్ తలకు గురిచూసి) నేటితో నీ జీవితం సమాప్తం!

(నిరంజన్ చేతులలోని కుర్చీ కిశోర్ తలపై బడుతున్న సమయంలో మేడమెట్లమీాద ఆకస్మికంగా చిత్ర కనిపిస్తుంది.)

చిత్ర: (భయంతో) ఆగు! (తొందరగా నిరంజన్‌కు కిశోర్‌కు

మధ్యకు వచ్చి నిలబడుతుంది. నిరంజన్ వైపు కోపంతో చూస్తూ) ఏమిటిది?

(హాలులో దీపాలన్నీ ఒక్కసారి వెలుగుతాయి. ఎడమ వైపునుంచి దినకర్, ఆనంద్, వృద్ధుడు తొందరగా ప్రవేశిస్తారు.)

దినకర్: సరిగా నాయిక ప్రవేశించవలసిన సమయం యిదే!

(చేతిలోని పుస్తకం తెరిచి చూస్తాడు.)

చిత్ర: (కోపంతో) ఏమిటిదంతా? ఎందుకు కొట్టుకుంటున్నారు?

(అందరి ముఖాలకేసి చూస్తూ) ఏం? ఒక్కరూ మాట్లాడరేం?

కిశోర్: (స్మితంగా) ఏమీ లేదు. నాటకం రిహార్సల్సు వేసు కుంటున్నాం.

చిత్ర: (కోపంతో) నో! నో! మీరు నాటకాల్లో వేషాలు వెయ్యడం నాకు ఇష్టంలేదు. యికముందు అటువంటి పని చేస్తే నేను వూరుకోనేది లేదు.

(రివ్వున తిరిగి మేడమెట్లదగ్గరకు వెడుతుంది.)

కిశోర్: (ఆమె వెనుక నడుస్తూ వినయంగా) యీ ఒకసారి ఎక్స్యూజ్ చెయ్యండి. యీ ఒక నాటకంలోను వేషం వెయ్యనివ్వండి. ఆతరవాత మీరు వెయ్యమన్నా వెయ్యను

చిత్ర: (మెల్లికన్నతూ) నాటకాలలో వేషాలు వేసేవాళ్ళు నిజ జీవితంలో కూడా వేషాలు వెయ్యకుండా వుంటారా? వీల్లేదు. నేను ఒప్పుకోను.

(ముందు చిత్ర వెనుక కిశోర్ మేడమీదికి వెళ్ళిపోతారు)

వృద్ధుడు: (కిశోర్ పోతున్న వైపు చూస్తూ) వెర్రినాయనా! నీకింకా బుద్ధి రాలేదురా. ఆడపిల్లల జోలికి పోవద్దని ఎంత చెప్పినా వినవుకదా !

(గెడ్డం మీసాలు తీసివేస్తాడు. యీసారి నిజరూపంలో జయరాం కనిపిస్తాడు.)

నిరంజన్: (అసంతృప్తితో) మీరు నాటకంలో హాస్యాన్ని శృంగారాన్ని చిత్రించలేకపోయారు కవిగారూ!

దినకర్: రౌద్రం, భీభత్సం, కరుణ యీ మూడు రసాలు లేకుండా నేను నాటకం రాయను.

ఆనంద్: రెండవ అంకంలో కొంత శృంగారాన్ని చిత్రించండి దినకర్.

దిన: ప్రయత్నిస్తాను. ప్రయత్నిస్తాను. మెరుపుతీగలవంటి సుందరాంగులను సృష్టిస్తాను. వాస్తవిక జగత్తులో తీరని కోరికలను కావ్యజగత్తులో తీరినట్లు చిత్రిస్తాను. నా పాఠకులను, ప్రేక్షకులను ఆనందడోలికలలో వూగిస్తాను.

జయ: అయ్యా! మీ కావ్య మీమాంస కట్టిపెట్టి కాఫీ తెప్పించండి. యిప్పటికే అలసిపోయాం.

ఆనంద్: అప్పుడే అలిసిపోతే ఎలా? మరో రంగం రిహార్సల్స్ చేసుకోవాలి.

జయ: నాయకుడు పరారీ అయ్యాడు. యిక రిహార్సల్సు రేపటికి వాయిదావెయ్యండి. నేను నా కోటాకడిగేసుకొనివస్తాను

కాఫీ మాత్రం మరచిపోకండి నిరంజన్‌గారు!

(జయరాం ఎడమవైపు నిష్క్రమిస్తాడు)

ఆనంద్: (జయరాం పోతున్నవైపు చూస్తూ) మహానుభావుడు యితగాడు ఏదేశంనుంచి వచ్చాడో! ఎప్పుడూ తిండిగురించే మాట్లాడతాడు.

దిన: తిండి! అది అత్యంతముఖ్యం! చరాచర జీవకోటికీ ఆహారాన్ని సృష్టించిన భగవానుడు, కొందరు మానవులకు మాత్రం తిండి అందకుండా చేశాడు. భగవంతునిపేర జరుగుతున్న యీ అన్యాయాన్ని మానవుడు సరిదిద్దాలి.

(సరిగా యీ సమయంలో బిగ్గరగా 'ఘోరం! 'ఘోరం!' అనుకుంటూ దండపాణి ఎడమవైపు నుంచి ప్రవేశిస్తాడు. ముఖానికి నల్లటిరంగు, తలకు తెల్లటి తలపాగ, చేతిలో ఒక ఇనుపగుదియ వుంటాయి.)

దండ: (ప్రవేశిస్తూ) ఘోరం! ఘోరం! (ఆనంద్‌ను సమీపించి) ఆనందబాబూ నాకు మంచి వేషం ఇవ్వవయ్యా అంటే యిలాంటి వేషమటయ్యా యిస్తావు?

ఆనంద్: నీ వేషానికేం? అమోఘమైన వేషం! యమధర్మరాజు వేషం అంటే మాటలా?

దండ: చాలు చాల్లేవయ్యా సెప్పావ్! నా వేషానికి మాటా లేదు, పాటా లేదు. పైగా సర్కస్ గుర్రంలాగా ముందుకీ వెనక్కీ గెంతడం అటయ్యా నాపని!

దిన: శాంతించు! శాంతించు! మూడవ అంకంలో నీ ప్రతిభను ప్రదర్శించుకొనడానికి కావలసినంత అవకాశం కలిగిస్తున్నాను.

దండ: (సంతోషంతో) అద్దదీ! మా డింకరు బాబుగారికి నేనంటే యెలాగా అభిమానమే.

నిరం: (సిగరెట్టు వెలిగించి) దండపాణీ! నీపాత్రను వున్నంతలో ప్రతిభావంతంగా నిర్వహించావోయ్!

దండ: (నిరసనగా) అదేం యేషం పోనిద్దురూ! పులియేషం యేసినోడికి తోకపట్టుకునే వోడిలాగ గెంతడం— ఒకటే గెంతడం !

చిత్ర: (నేపథ్యంలోంచి) దండపాణీ, దండపాణీ!

దండ: సంపేశారు. ఇప్పుడే పిలిశారే! ఈ యేషంతో యెల్లడమే! (నిరంజన్‌తో) అలా పైకి ఎల్లానని సెప్పండి బాబూ. ఈలోపుసి రంగు కడిగేసుకుని వస్తాను.

(దండిపాణి తొందరగా ఎడమువైపు నిష్క్రమిస్తాడు.)

నిరం: ఇక మనంమాత్రం యిక్కడ ఎందుకు? రేపటికి రిహార్సల్సును ఏర్పాటు చేసుకుందాం, పదండి.

(లేచి ముందుకు నడుస్తాడు.)

ఆనంద్: (నడుస్తూ) కిశోర్ తనపాత్రను అమోఘంగా నిర్వహించాడు. కాని మనిషికి కొంచెం స్థైర్యం తక్కువ.

దిన: ప్రతిభావంతుడైన నటునికి కూడా నిజ జీవితంపై నీలి తెరలు తప్పవు. తెర తొలగించుకొని రంగం అలంకరించే సరికి కాలం కాస్తా గడిచిపోయి వూరుకొంటుంది.

(ముందు నిరంజన్. ఆనంద్—వెనుక దినకర్ ఎడమ వైపు నిష్క్రమిస్తారు— చిత్రి చరచరా మేడమెట్లు దిగి క్రిందికి వస్తుంది. ఆమె ముఖంలో కోపం కనిపిస్తూనే వుంది. ఆమె వెనుక వినయంగా కిశోర్ వస్తాడు.)

చిత్ర: మీకు యిటువంటి దురలవాట్లు వున్నట్లు నాకు తెలియదు

కిశోర్: నాటకంలో వేషం వెయ్యడం దురలవాటా? మీవంటి చదువుకున్నవాళ్ళు కూడా అలా అంటే ఎలా? అది ఒక కళ!

చిత్ర: నటులు దురలవాట్లకు చేరువలో వుంటారని నాన్నగారు అంటారు. యింకానయం. ఆయన మిమ్మల్ని వేషం వేస్తుండగా చూశారు కాదు!

కిశోర్: చూస్తే కోపపడతారా?

చిత్ర: కేవలం కోపపడి వూరుకోరు. అసలు యీ సంబంధం పనికిరాదు పొమ్మంటారు.

కిశోర్: (ఆశ్చర్యంతో) ఏమిటి? సంబంధమా? మీ మాటలు నాకు బోధపడడం లేదు.

చిత్ర: (కోపంతో)మీకు తెలుగులో చెబితే బోధపడడంలేదా? మన 'మేరేజి'కి డాడీ ఒప్పుకోరు. యీసారి తెలిసిందా?

కిశోర్: (మరింత ఆశ్చర్యంతో) మీ ప్రవర్తన నాకు చాలా విచిత్రంగా కనిపిస్తోంది. నేను నిన్న యిక్కడ అడుగు పెట్టగానే పట్టుకున్నారు. కావలసినంత మర్యాద చేశారు. మీరు సహజంగా ఇక్కడకు వచ్చిన అతిధులకు ఆవిధంగానే మర్యాద చేస్తారని నన్ను నేను సమాధానపరుచుకున్నాను. తరవాత మీరు కొన్ని ప్రశ్నలు వేశారు. కాలక్షేపం కోసం ఏదో అడుగుతున్నారని అనుకున్నాను. జవాబులు చెప్పాను. మీకు వినోదం కలిగించేందుకు పాటలు పాడాను— కాని మీరు యిప్పుడు పెళ్ళివిషయం ఎత్తడంతో— నా ఆశ్చర్యానికి మేరలేకుండా వుంది.

చిత్ర: (కొరడా దెబ్బ తిన్నదానివలె చలించి) మీకు యీ పెళ్ళి యిష్టం లేదా?

కిశోర్: (సీరియస్‌గా) నేను యిక్కడకు పెళ్ళి చేసుకునేందుకు రాలేదు.

చిత్ర: (హేళనగా) నాటకంలో వేషం వెయ్యడానికి వచ్చావా?

కిశోర్: బ్రతుకు తెరువుకోసం వచ్చాను. గత్యంతరం లేక నాటకంలో వేషం వేశాను.

చిత్ర: నన్ను మోసం చేద్దామనుకుంటున్నావా? నీకు బ్రతుకు తెరువుకు ఏంలోటు?

కిశోర్: (హేళనగా) మోసం. యీకాలంలో ప్రతి యువతికి యీ మాట ఒకటి బాగా అలవాటు అయ్యింది.

చిత్ర: నువ్వు నోటికి వచ్చినట్లు మాట్లాడ్డానికి వీల్లేదు.

కిశోర్: వృథా వాగ్వివాదం దేనికి! యిక నాకు సెలవు.

(ఎడమవైపు వెడుతూ వుంటాడు)

చిత్ర: (ఆజ్ఞాపించే ధోరణిలో) ఆగు.

కిశోర్: (ఆగి) యీ అనంతమైన బ్రతుకుబాటలలో ముందుకు సాగి తీరవలసిందే. ఆగినందువల్ల ప్రయోజనంలేదు.

చిత్ర: (అతనిని సమీపించి ప్రాధేయ పూర్వకంగా) ఆగు! నా మాట విను. ఒక క్షణం కూర్చుని ఆలోచించు. విచారంలో ముంచకు.

కిశోర్: అయితే మీ అభిప్రాయం ఏమిటి?

చిత్ర: (అతని రెండుచేతులూ పట్టుకొని) నీకు అర్థం కావడం లేదూ? నాతోనే జవాబు చెప్పించాలనుకుంటున్నావా?

కిశోర్: (చలించి ఆమె కళ్ళల్లోకి చూస్తూ) మీకళ్ళలో ఏదో విచిత్రమైన శక్తి వుంది. కాని వెనువెంటనే నా కర్తవ్యం నా స్మృతిపథంలో నిలిచి యీ ప్రదేశాన్ని విడిచిపొమ్మని నన్ను హెచ్చరిస్తోంది.

చిత్ర: వద్దు, వద్దు, నువ్వుమాత్రం ఆ పని చెయ్యకు.

(కుడివైపునుంచి ముందు వామనమూర్తి వెనుక దామోదరం ప్రవేశిస్తారు.)

వామ: (ప్రవేశిస్తూ) అబ్బాయ్, మీ నాన్నగారికి మా మాట మీద నమ్మకం కలగడం లేదోయ్.

(తండ్రిమాట వినగానే చిత్ర కిశోర్ చేతులు విడిచి పెడుతుంది. కిశోర్ వెనక్కి తిరిగి చూస్తాడు)

దామో: (కిశోర్‌ను చూచి చకితుడై) యితనెవరు?

వామ: (ఆశ్చర్యంతో) యితడు మీ అబ్బాయికాదా ?

దామో: కాదు. కాదు. దీనిలో ఏదో కుట్రవున్నట్లు కన్పిస్తోంది.

వామ: (కోపంతో కిశోర్‌ను సమీపించి) ఎవరు నువ్వు? మాట్లాడవేం? మమ్మల్ని యిలా మోసం చెయ్యడానికి కారణం ?

కిశోర్: (చలించకుండా) నేనేమీ మోసం చెయ్యలేదు. మిమ్మల్ని మీరే మోసం చేసుకున్నారు— యీ క్షణంవరకూ నాకు నోరు తెరవడానికైనా అవకాశం కలగనివ్వలేదు మీరు. మర్యాదలతో ప్రశ్నలతో విందులతో వినోదాలతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేశారు. ఇప్పుడిప్పుడే నాకు పరిస్థితి అర్థం అవుతోంది.

వామ: (ఉగ్రుడై) యింకా సిగ్గులేకుండా మాట్లాడుతున్నావు. నువ్వు మోసగాడవు. దగాకోరువు. నువ్వు జైలునుంచి విడుదల అయివచ్చిన పాత నేరస్థుడిలా కనిపిస్తున్నావ్.

కిశోర్: (కోపంతో) మీరు గొప్పవారయితే కావచ్చును. కాని దారినిపోయేవాడిని పిలిచి అవమానపరచేహక్కు మీకు

ఎంతమాత్రం లేదు.

వామ: (కోపావేశంతో) నాకు నీతిపాఠం కూడా బోధిస్తున్నావ్ పో. యిక్కడినుంచి ముందుకు బయటకు పో. మర్యాదగా బయటకు పోతావా ? లేక నౌకరుతో బయటకు నెట్టించమంటావా ? (బిగ్గరగా) దండపాణీ, దండపాణీ.

(ఎడమవైపునుంచి తొందరగా దండపాణి వస్తాడు. అతని ముఖాన్ని యింకా నల్లరంగు వదలలేదు.)

దండ: (ఆశ్చర్యంతో) బాబుగారూ.

వామ: (కిశోర్‌ను చూపిస్తూ) వీడిని మెడపట్టుకొని బయటకు గెంటు.

(దండపాణి అర్థంకాక నోరు తెరచి చూస్తాడు.)

కిశోర్: (విచారంతో) దరిద్రుడి చేతికి పెన్నిధిని అయాచితంగా అందించి—కొన్ని క్షణాలపాటు మోహజాలంలో ముంచి-తిరిగి లాగుకున్నట్లు వుంది. దీనికి ఒకరిని నిందించి ప్రయోజనం లేదు. యీ భయంకరమైన నీలితెరలను తొలగించుకొని ముందుకు పోవడంకంటే చేయగలిగిందేమీ లేదు.

(కిశోర్ కుడివైపు నిష్క్రమిస్తాడు.)

చిత్ర: (ఆశ్చర్యంనుంచి తేరుకొని) అతనిని అనవసరంగా నిందించారు డాడీ! యిందులో ఏదో పెద్ద పొరబాటు వుంది.

వామ: (కోపంతో)పొరబాటేమీలేదు. నిలువునా దగాచెయ్యడానికిసిద్ధపడ్డాడు. పోలీసులకు అప్పగిస్తేఅతడు మాజీ నేరస్థు

డయ్యిందీ కానిదీ క్షణంలో తేలిపోయి వుండేది.

చిత్ర: (కోపంతో) మీ రిలా మాట్లాడతారనుకోలేదు. (బ్రతిమాలుతూ) యిందులో అతని తప్పేమీలేదు. నామాట విని అతసిని పిలిపించుతారా!

వామ: (కోపంతో) యిక వూరుకో. ఎవరైనా వింటే నవ్వుతారు. నీకు ప్రపంచజ్ఞానం బొత్తిగా లేదు.

చిత్ర: (దృఢ నిశ్చయంతో) మీరేం చెప్పినాసరే డాడీ, అతనిని తప్ప మరెవరినీ నేనిక పెళ్ళిచేసుకొనేది లేదు.

(చకచకా మేడమీదికి వెళ్ళిపోతుంది. దామోదరం వామనమూర్తి ఒకరి ముఖంకేసి ఒకరు చూసుకుంటారు. యిద్దరి ముఖాలకేసి దండపాణి చూస్తూవుంటాడు. [తెర.

# నీ లి తె ర లు

## [ అ యి ద వ అం కం ]

(స్థలం : అదే సమయం : సాయంత్రం 5 గంటలు. హాలులో ఒకవైపు సోఫా; మరోవైపు రెండు కుర్చీలు, మధ్య టేబిలు వున్నాయి. కుర్చీలో నిరంజన్ కూర్చుని వున్నాడు. దామోదరం కోపావేశంతో అటూ యిటూ తిరుగుతున్నాడు.)

దామో: వున్నవాడవు ఒక్కడవు. నీ గురించి నా ప్రాణం విసిగిపోతోంది. ఎన్ని సంబంధాలు చూసినా వద్దు పొమ్మం

టావ్. అసలు నీ ఉద్దేశం ఏమిటి ?

నిరం: (నిశ్చలంగా) అది మీకు నేను ఏనాడో చెప్పాను.

దామో: (కోపంతో) ఏం చెప్పావ్? యిప్పుడు పెళ్ళి వద్దం టావ్. అంతేనా నువ్వనేది.

నిరం: అవును: అదే.

దామో: సరే! నువ్వు చెప్పినట్లే విని నీకు పెళ్ళిచెయ్యకుండా వూరుకుంటాననుకో — అప్పుడు నీవు పై మెరుగులకు భ్రమించి ఏ నాటకాలలో వేషంవేసిన పిల్లనో పెళ్ళిచేసు కోవడానికి సిద్ధపడితే?

నిరం: అలా జరిగినా జరగవచ్చు. అందులో నాకేమీ తప్పు కనిపించడంలేదు.

దామో: (కోపంతో నిరంజన్‌ను నఖశిఖ పర్యంతం చూస్తూ) ఓహో! అంతవరకూ వచ్చావు. నిన్ను యిలా విడిచిపెట్ట డం చాలా ప్రమాదం అని నేటికి ఋజువు అయ్యింది. ఆఖ రుసారి అడుగుతున్నాను. నువ్వు వామనమూర్తిగారి అమ్మా యిని పెళ్ళిచేసుకుంటావా? లేదా?

నిరం: అది కలలోకూడా జరగడానికి వీల్లేదు.

దామో: ఆ పిల్ల అందచందాలలో ఏమైనా లోటువుందా?

నిరం: ఎంతమాత్రం లేదు.

దామో: ఆమెకు చదువు తక్కువా?

నిరం: కాదు.

దామో: ఆమె తెలివితేటలలో ఏమైనా లోటుపాట్లువున్నాయా?

నిరం: లేవు.

దామో: (కోపంతో) అయితే యిక నీ అభ్యంతరం దేనికి ? ఆమెను పెళ్ళిచేసుకోననడానికి కారణం యేమిటి?

నిరం: (సూటిగా) మరొకనికి మనసుయిచ్చిన యువతివైపు— జ్ఞానం తెలిసిన ఏ యువకుడూ కన్నెత్తిచూడడు. దయచేసి యిక యీ విషయంలో నన్ను బలవంతం చెయ్యకండి.

దామో: క్షణికోద్వేగానికిలోనై దీర్ఘమైన జీవితాన్ని నాశనం చేసుకోకు. మరో నాలుగురోజులు టైం యిస్తున్నాను. ఆలోచించు.

(దామోదరం కుడివైపు నిష్క్రమిస్తాడు. ఎడమవైపు నుంచి దండపాణి వస్తాడు.)

దండ: ఆయన్ని ఎతికిపట్టుకోమంటే నా తరమా? ఆనందంగారు నిన్నటినుంచి నా పేణం తీసేస్తున్నారు.

నిరం: (పరధ్యానంగా) ఆయన ఎవరు?

దండ: అదేనండీ! ఆయన-ఆయన పేరు ఏదోగాని సెప్పారండి. (ఆలోచిస్తూ) తుషార్ ...తుషార్...ఆదేదో స రి గా గ్యాపకం రావడం లేదండి.

నిరం: కిశోర్ గురించా?

దండ: అద్గదీ! అదేనండి! దీసి తస్సాదియ్యా! ఆ పేరు నోరు తిరక్కుండా వుందండి.

నిరం: అతని జాడ నీకు ఏక్కడైనా తెలిసిందా?
దండ: లేదు బాబూ! నిన్నటి నుంచీ దారినిపోయేవాళ్ళందర్నీ సూస్తున్నాను.
నిరం: చూడు! చూడు! అతను లేకపోతే యిప్పుడు మన నాటకం ఆగిపోతుంది.
దండ: మనలో మనమాట! తిట్టి గెంటేసిన తరువాత ఆ బాబు ఏముఖం పెట్టుకుని వస్తాడండి?
నిరం: (కోపంతో) మన నాటకమండలిలోని ఒక నటుణ్ణి అవమానపరచే హక్కు వామనమూర్తిగారికి ఎవరిచ్చారు? యీ విషయం యేదో నేను తేల్చుకుంటాను. నువ్వు వెళ్ళిరా.

(నిరంజన్ ఎడమవైపు నిష్క్రమిస్తాడు. దండపాణి కుడివైపు నడుస్తూవుంటాడు) అతనికి వామనమూర్తి ఎదురు వస్తాడు.)

వామ: ఎక్కడికి పోతున్నావ్?
దండ: ఆఁ...మరి...రోడ్డుమీదకి ఎళతన్నానండి.
వామ: ఎందుకు?
దండ: మరి...ఆనందం బాబు...
వామ: ఏం చెయ్యమన్నాడు?
దండ: ఆఁ...మరి...(ఒక్కసారి స్ఫురణకువచ్చినట్లు (సిగరెట్ పెట్టి తెచ్చిపెట్టమన్నారండి.

వామ: తరవాత వెళ్ళవచ్చు. ముందు పైకివెళ్ళి అమ్మాయిని పిలుచుకురా.

(దండపాణి మేడమీదికి వెడతాడు. వామనమూర్తి హాలులో తిరుగుతూ వుంటాడు—మేడమీది నుంచి ముందు చిత్రి వెనుక దండపాణి వస్తారు. చిత్రి ముఖంలో విషాదం కని పిస్తోంది.)

చిత్రి: (కోపంతో) ఎందుకు పిలిచారు?

వామ: దామోదరంగారు యిప్పుడు తిరిగి కనిపించారటమ్మా

(దండపాణి యిద్దరికేసీ ఒకసారి చూసి పెదవి విరిచి కుడి వైపు నిష్క్రమిస్తాడు.)

చిత్రి: యిక ఆమాట నా దగ్గర చెప్పకండి.

వామ: వూరూపేరూ తెలియని వాణ్ణి దారినిపోయే వాణ్ణి పెళ్ళి చేసుకుంటానంటువా? ఎవరైనా వింటే ఎంత అప్రతిష్ఠ!

చిత్ర: నన్ను అనవసరంగా విసిగించకు డాడీ! నేనసలు పెళ్ళే చేసుకోను.

(తండ్రిమాటకు ఎదురు చూడకుండా గిర్రున తిరిగి మేడమీదికి వెళ్ళిపోతుంది. వామనమూర్తి నిస్పృహతో కుడి వైపు వెళ్ళిపోతాడు— ఎడమవైపునుంచి ఆనంద్, దినకర్ వస్తారు.)

దినకర్: (సోఫాలోకూర్చునిపుస్తకం తెరచి)అర్థంచేసుకో బాగా అర్థంచేసుకో, నీ పాత్రను అర్థం చేసుకొని నటించు.అప్పుడే

నీవు ఉత్తమ నటుడవవుతావు. కాలానికి ఎదురీదకు! పురోగమనానికి అడ్డురాకు.

ఆనంద్: దినకర్ మహాశయా, కనీసం నాటకరంగంలోనైనా ప్రణయ ఘట్టాన్ని చిత్రించండి.

దిన: చిత్రిస్తాను. పసిపాపకు పాలులేక ప్రణయాన్వేషులకు తన స్నేహాన్ని అమ్ముకున్న వెలయాలిని, యిహలోకపు మాయా వాగురుల సాలెగూడులో చిక్కుకున్న మందయానను చిత్రిస్తాను.

ఆనంద్: నేను ప్రేక్షకులకు కావలిసింది వినోదం, మీరు నాటకాన్ని విషాదంతో నింపితే లాభంలేదు.

దిన: వినోదం కావాలా? రాస్తాను. చెమటోడ్చి అష్టకష్టాలకు లోనై రైతు పండించే పంట సమస్తం ఏడు అంతస్థుల మేడలోకి రవాణా అవుతోంది. పేదరైతుకు చివరకు మిగిలేది గడ్డి. హాహ్హాహ్హా, అంతా శుద్ధ హాస్యం. కావలిసినంత వినోదం.

ఆనంద్: నవ్వులో రెండు రకాలు వున్నాయి. ఆనందాన్ని ఆపుకోలేక నవ్వే నవ్వు, రెండవది ఏడవలేక నవ్వే నవ్వు, యీ రెండవ తరగతి హాస్యం మాత్రం వద్దు కవిగారూ.

దిన: వెర్రి నాయనా! మన చుట్టూ కనపించేది యీ రెండవ తరగతి హాస్యమే! మామిడిచెట్టుకు ఒకడు నీరుపోసి, గొప్ప

తవ్వి పెంచి పెద్దది చేశాడు. దాని పళ్ళు మరొకడు పట్టుకుపోయి తింటున్నాడు— యిది అతి సున్నితమైన హాస్యం.

ఆనంద్: ఆ హాస్యంవల్ల మీ నాటకం వెలుగులోకి రాదు కవి గారూ!

దిన: దగాపడిన సోదరమానవులతో నేనూ చీకట్లోకి ప్రవేశిస్తాను. కంచుకాగడా వెలిగించి చీకటిని పటాపంచలు చెయ్యడానికి ప్రయత్నిస్తాను. మనిషికీ మనిషికీ మధ్యవున్న గోడలను పగల గొడతాను.

ఆనంద్: మీ ముఖంలో ఆవేశం? కళ్ళలో ఎరుపు కనిపిస్తోంది.

దిన: (పుస్తకం తెరిచి) ప్రపంచాన్ని భస్మం చేసే శక్తి ఆటం బాంబుకు లేదు. నిరుపేదల కళ్ళలోని ఎరుపే ప్రపంచాన్ని భస్మం చెయ్యగలదు. ప్రమాదాన్ని యిప్పటికైనా గుర్తించు! నీ సుఖంలో, నీ సంతోషంలో కొంత భాగాన్ని అతనికీ పంచు. ఉత్తమనటుడవనిపించుకో. జన్మించినప్పుడు ధనవంతుడు బంగారు హారాలతో జన్మించడం లేదు! దరిద్రుడు చింకి గుడ్డలతో జన్మించడంలేదు. జీవన యాత్ర ముగించి నప్పుడు యిద్దరూ పవిత్ర ధరిత్రి యెదపై సరి సమానంగా పవ్వళించక తప్పదు. పుట్టుకలో చావులో యిద్దరికీ భేదంలేదు. వున్న భేదమంతా జీవనయాత్రలో,

యీా భేదాన్ని సృష్టించిన హిరణ్యాగర్భుడెవరో వెతికి పట్టుకోవాలి !

నిరంజన్: (సరిగా చివరిమాట అనే సమయంలో ప్రవేశించి) వెతికి పట్టుకోవాలి ఆనంద్! నువ్వు ఖాళీగా కూర్చుంటే ప్రయోజనం లేదు. కిశోర్ లేకపోతే యిప్పుడు మన ప్రయత్నాలన్నీ వ్యర్థమౌతాయి.

ఆనంద్: నిన్నటినుండీ జయరాం తీవ్రంగా వెతుకు తున్నాడు. వూరుదాటి పోతే చెప్పలేం కాని వూళ్ళో ఏమూల వున్నా అతనుగాలించి పట్టుకోగలడు.

నిరం: (అసంతృప్తితో తిరుగుతూ) మనదగ్గర వందరూపాయలు అడ్వాన్సు తీసుకొని, మన నాటకమండలిలో సభ్యుడై — కేవలం వామనమూర్తిగారు పొమ్మన్నంత మాత్రాన పోతాడా? నాన్సెన్సు.

ఆనంద్: మనసు చెడి—తాత్కాలికావేశంతో ఎక్కడికో పోయి వుంటాడు.

నిరం: వీల్లేదు. అతను ఎక్కడికీ పోవడానికి వీల్లేదు. ఏమైనాసరే, అతనిని యిప్పుడే వెతికి పట్టుకోవాలి. యీా రాత్రితో రిహార్సలు్సు పూర్తికావాలి.

ఆనంద్: నేనూ అదేప్రయత్నంలో వున్నాను. దండపాణిని కూడా వెతకడానికి పంపాను.

దిన: (శాస్త్రీ)

మానస సరోవర తీరంపై కూర్చుని
మైమరచి ప్రకృతిని తిలకించు
ఇహలోకపు దుఃఖాలను విస్మరించు
నీ మనసును ప్రశాంతపరచి
తిరిగి రమ్ము ఈలోకానికి

(కుడివైపునుంచి దండపాణి ప్రవేశిస్తాడు)

ఆనంద్: (ఆత్రుతతో) కనిపించాడా?

దండ: మీ వెర్రిగాని ఆయన కనపడతాడటండీ?

నిరం: (కోపంతో) ఎందుకు కనపడడు? సప్తసముద్రాలకు అవతలవున్నా వెతికి పట్టుకొంటాం. ఆనంద్, యిక ఆలస్యంచేస్తే లాభంలేదు. మనం యిద్దరం చెరో టాక్సీలోను వూరంతా వెతుకుదాం! లే!

ఆనంద్: సరే! ఏం చేస్తాం! పద!

(యిద్దరూ లేచి రెండు అడుగులు ముందుకు వేసేసరికి కుడివైపు జయరాం కనిపిస్తాడు. అతని ముఖంలో విషాదచ్ఛాయలు కనిపిస్తున్నాయి.)

నిరం: (ఆత్రుతతో జయరాంను సమీపించి) ఏమయ్యింది? ఎక్కడయినా కనిపించాడా?

జయ: (నిస్పృహతో కుర్చీలో కూలబడి) యీ విషాదవార్త ఎలా చెప్పను?

ఆనంద్: కొంపతీసి కిశోర్ ఆత్మహత్య చేసుకోలేదుకదా?

జయ: లేదు. యింతవరకూ అటువంటి దేమీ జరగలేదు. యిక ముందు జరగకుండా వుంటుందని మాత్రం చెప్పలేం.

నిరం: (అసహనంతో) అసలు నీకు అతను కనిపించాడో లేదో చెప్పవేం?

జయ: కనిపించాడు. కాని మనిషి మనలో లేడు.

దండ: యిసారం మర్చిపోడానికి రెండు సుక్క లేసుకుని వుంటాడు.

ఆనంద్: యిక్కడకు తీసుకురాకుండా వుత్తచేతులతో వచ్చావేం!

జయ: ఎంత బ్రతిమాలినా యిక్కడకు రావడానికి ఒప్పుకో లేదు.

నిరం: నాతో రా! ఎక్కడవున్నాడో చూపించు. అతసిని నిము షాలమీద యిక్కడకు తీసుకు వస్తాను. ఆనంద్, నువ్వు యిక్కడేవుండు, మేం అయిదునిముషాలలో కిశోర్ను తీసుకు వస్తాం.

(నిరంజన్, జయరాం కుడివైపు నిష్క్రమిస్తారు.)

దండ: మనిషంటే నిరంజనం బాబుగారే మనిషి! పట్టుదల అంటే అలాగుండాలి. యీ రాత్రి మళ్ళీ మనం నాటకం నికార్సులు ఏసుకుంటామన్న మాటే.

ఆనంద్: యిక నీ అవసరంలేదు. నీ పోర్షన్ మొన్నటితో అయి పోయింది.

దండ: అదేంటండోయ్! అప్పుడే అయిపోతే ఎలాగా! నాకు

మాటా పాటా లేని యేషం వద్దు. మరో మంచియేషం యిస్తారా లేదా?

ఆనంద్: త్వరలో చూస్తాం.

దండ: డింకిరుబాబుగారూ, మీరైనా సెప్పండి.

దిన: (పుస్తకంలోంచి తల పైకెత్తి) ఏమంటావ్?

దండ: నాకు మంచియేషం యిప్పించండి.

దిన: నీవేషం అత్యుత్తమమైనది. నీకు ఒకరిని పీడించవలసిన అవసరం లేదు. అన్యాయాలు, అక్రమాలు నీచేతులారా నీ వెన్నడూ చెయ్యవు. నీమాటలలో కృత్రిమం లేదు. నీ పాటలలో సహజత్వం వుంది.

ఆనంద్: అదీ! అలా నచ్చచెప్పండి దినకర్. లేకపోతే రెండో రంగంలో నాలుగు మాటలూ ఒక పాటా పెట్టండి.

దిన: నీకు ఎటువంటి పాట కావాలి?

దండ: (ముందు బిగ్గరగా ఓ...... అని రాగంతీసి తరవాత పాడతాడు.)

ఓ... ఓ బలే శుని కొండల నడుమా

యెద్దులతోలే ముద్దుల మరిది

దాపటెద్దుకు దప్పికాయెనురా.

(ఓ...... అని చివర బిగ్గరగా రాగం తీస్తాడు.)

ఆనంద్: (లేచి) చాలు! చాలు! మచ్చుకు యీ పాట ఒకటే

చాలు. మరొక పాట పాడేవా యీ వీధిలోని మనుషు లంతా లేచి యిక్కడకు రావచ్చు.

(కుడివైపునుంచి నిరంజన్, కిశోర్, జయరాం ప్రవే శిస్తారు. కిశోర్ జత్తు చిందరవందరగా వుంది.)

నిరం: (నచ్చచెప్పే ధోరణిలో) నేను వున్నంతవరకూ నీకేం భయంలేదు. నిన్ను ఎవరు ఏమన్నా నేను వూరుకొనేది లేదు.

కిశోర్: యిక్కడ తిరిగి అడుగు పెట్టడం నాకు బొత్తిగా యిష్టంలేదు.

నిరం: రెండురోజులలో మన ఆఫీసును యిక్కడినుంచి మార్చే ద్దాం. అంతవరకూ ఓపికపట్టు.

కిశోర్: ఒక క్షణంకూడా యిక్కడ వుండడం నాకు యిష్టం లేదు. కాని మీకు ముందుగా మాట యిచ్చాను. యిక తప్పదు. అలాగే వుంటాను. ఏ క్షణంలోనైనా యిక్కడ పరిస్థితి దుర్భరంగా కనిపిస్తే తక్షణం యీచోటు విడిచిపెట్ట వలసి వుంటుంది.

నిరం: నీకు ఆభయం అవసరంలేదు. నీకు అవమానం జరిగితే నాకు జరిగినట్లే భావిస్తాను. (హేండ్ బేగ్ లోంచి కాగితాలు తీసి) యిదిగో! నీ పోర్టు ఫోలియో! యిక శ్రమతో ఏదు. వేగం చదువు, (దండపాణితో) దండపాణీ! వీరికి కాఫీ తీసుకురా!

(దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు.) యిక మీరు రండి. మనం మిగిలిన ఏర్పాట్లు చేసుకుందాం.

(నిరంజన్, జయరాం, ఆనంద్ ఎడమవైపు నిష్క్రమిస్తారు. కిశోర్ కుర్చీలో కూర్చొని తన పోర్షన్ చదవడానికి ఉపక్రమిస్తాడు. చదవలేక వికలమనస్కుడై చుట్టూ చూస్తూ వుంటాడు. దినకర్ సోఫాలో కూర్చొనిరాసుకుంటూనేవున్నాడు.

కిశోర్: కవిగారూ, మనిషిచుట్టూ యిన్ని ఆకర్షణలు ఎందుకు వున్నాయి? వాటికి లొంగకుండా తప్పించుకునేశక్తి మనిషికి లేదా?

దిన: (తలపైకెత్తి) లేదు. నాయనా విచారించకు, నీ మనసు దృఢపరుచుకో! మానవుడై జన్మించిన తరవాత కామ క్రోధ లోభాలకు గురికాకపోవటం తప్పదు. (కుడివైపునుంచి దండపాణి ట్రేతో ప్రవేశిస్తాడు. యిద్దరికీ చెరోకప్పు అందిస్తాడు.)

కిశోర్: మీరు యిక్కడ ఎందుకు వుంటున్నారు దినకర్?

దిన: మరో ప్రపంచానికి మార్గాన్ని వెతికేటందుకు:

దండ: అమ్మాయిగారికి సమవు సెప్పడానికొచ్చాను.

కిశోర్: (విచారంగా) దినకర్ మీరు నిజంగా ఎంత అదృష్టవంతులు! యీ ప్రపంచపు సుఖదుఃఖాలు మీదరికి చేరవు.

దిన: (ఖాళీకప్పు టేబిలుమీద పెడుతూ) సుఖం. దుఃఖం

నాచుట్టూ తాండవమాడుతూ వుంటే నేను కళ్ళు మూసుకుని కూర్చోగలనా? ప్రజా సముద్రంలో నేనొక తరంగాన్ని, అన్ని కెరటాలతోపాటు నేనుకూడా పైకిలేచి విరిగిపడక తప్పదు.

(ఖాళీకప్పులతో దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు.)

కిషోర్: (లేచి తిరుగుతూ) ఒక్కో పరిస్థితిలో మనిషి తనకు యిష్టంలేనిపని చెయ్యవలసి వస్తుంది. పరిస్థితులకు లొంగిపోక తప్పదు. యిష్టం లేకపోయినా నేనీ నాటకంలో పాత్ర నభినయించి తీరాలి.

దిన: అభినయించు. నిర్భయంగా నటించు. నీలో ఉత్తమ నటుని లక్షణాలు కనిపిస్తున్నై. నీవు నిరాటంకంగా ముందుకు సాగిపోగలవు. నిరాశలతో నిండిన నేటిని విస్మరించు. రేపు నీదే! అభాగ్య మానవ కోటికి శుభోదయం రేపే! అప్రమత్తతతో ప్రవర్తించు.

కిశోర్: నిన్నటి కష్టాలు మానని గాయాలలా బాధపెడుతున్నై. వాటిని మరిచిపోవడం సాధ్యమా?

దిన: నిన్నటి కష్టాలు రేపటి మహోదయం ముందు దినకరుని ముందు దివిటీవంటివి. అవి కనిపించవు. వాటికై చింతించకు. వెనుదిరిగి చూడకు. (రాస్తూ)

నిరాశల
నీలి తెరలు
తొలగిపోవు
శుభ సమయం
రేపే! రేపే!
నిదుర లేచి
కనులు తెరచి
తరుణారుణ
కిరణాలకు
ఎదురుచూడు!
నిలచిచూడు!

(పాడుకుంటూ ఉన్మత్తునివలె ఎడమవైపు వెళ్ళిపోతాడు దినకర్.)

(కిశోర్ తిరిగి కుర్చీలో కూర్చుని పోగ్రాం చదవడానికి ప్రయత్నిస్తూ వుంటాడు. చక్కగా ముస్తాబై హాండ్‌బేగ్‌తో చకచకా మేడమెట్లు దిగివస్తుంది చిత్ర.)

చిత్ర: (కిశోర్‌ను అకస్మాత్తుగా చూసి చకితయై) కిశోర్!
కిశోర్: (తలపైకెత్తి కొత్తమనిషిని చూసినట్లు చూస్తాడు.)
చిత్ర: రెండురోజులలోనే మరిచిపోయావా నన్ను ?
కిశోర్: మనస్ఫూర్తిగా మరిచిపోదలిస్తే రెండురోజులు కూడా అవసరం లేదు. రెండుక్షణాలలో మరిచిపోవచ్చు. సరే

దానికేం! ఎక్కడికో వెడుతున్నట్లున్నారు. వెళ్ళిరండి.

చిత్ర: నేను ఎక్కడికి వెడుతున్నానో నీకు తెలుసా?

కిశోర్: తెలియదు. (నిర్మోహమాటంగా) తెలుసుకోవాలన్న కుతూహలంకూడా నాకు లేదు.

చిత్ర: ఎంత కటువుగా మాట్లాడుతున్నావు!

కిశోర్: నగ్నసత్యం కటువుగానే వుంటుంది. ఈ కాలపు మను షులకు మోసం, వంచనలతో కూడిన మాటలే మధుర మధురంగా వినిపిస్తాయి.

చిత్ర: మానాన్నగారి మాటలు నీ హృదయాన్ని గాయపరిచి వుండవచ్చు. అంతమాత్రాన్ని నువ్వు...

కిశోర్: (మధ్యలో అందుకొని) లేదు. లేదు. అది అంతా అప్పుడే మరిచిపోయాను. ఇక దయచేసి ఆ విషయాలు నాకు జ్ఞాపకం చెయ్యకండి.

చిత్ర: నిజంగా నీకు చాల అన్యాయం గిజరింది కిశోర్. మా అంతట మేమే ముందు పొరబాటుపడి—పైగా నిన్ను నిం దించాం. నిన్ను ఈరోజు ఎలాగైనా వెతికిపట్టుకొని క్షమా ర్పణ చెప్పుకోవాలని బయలుదేరాను. మేడదిగీదిగడంతోనే నిన్ను ఇక్కడే చూసి నాకళ్ళను నేను నమ్మలేకపోయాను.

కిశోర్: (చేతిలోని కాగితాలకేసిచూసి) నాకు పోర్షన్ చదువుకో డానికి టైం చాలదు దయచేసి ఇక మీారు నన్ను ఒంటరిగా విడిచిపెట్టాలి.

చిత్ర: మనుష్యుల జీవితాలకంటె నాటకం ముఖ్యమా?

కిశోర్: ఒకవిధంగాచూస్తే ముఖ్యమే! కళకోసం ఎంతమంది మహామహులు తమ జీవితాలను ధారపోయలేదు?

చిత్ర: నీతో నేను కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి. ఆ తరవాత నీ ఇష్టం. నాటకంలో వేషంవేసినాసరే! భరత నాట్యంచేసినా సరే!

కిశోర్: ఒకసారి పరాభవం జరిగిన యీ ప్రదేశంలో తిరిగి మీతో మాట్లాడడం నాకు ఏంతమాత్రం యిష్టం లేదు.

చిత్ర: అలా అయితే మరీమంచిది. నిన్ను వెతికేందుకు టాక్సీని పిలిపించాను. కొంతసేపు ఎక్కడికైనాషికారుపోయి వద్దాం, రా! అక్కడే స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చు. బయట కారు సిద్ధంగా వుందిలే!

కిశోర్: యిప్పటికే నా మనసు చెదిరిపోయింది. దయచేసి యిక నన్ను బాధపెట్టకండి. మీదారిని మీరు వెళ్ళండి.

చిత్ర: ఈ ఒకసారీ నా మాట విను. సముద్రతీరంలో కొన్ని నిముషాలు తిరిగితే చెదిరిన మనసు కుదుటపడుతుంది. అర గంటలో తిరిగివద్దాం. యికలే! (అతని చెయ్యి పట్టుకుని ముందుకు తీసుకువెడుతూ) దండపాణీ! దండపాణీ!

దండ: (కుడివైపునుంచి ఎదురువచ్చి ఇద్దరినీ చూసి ఆశ్చర్య పోయి తిరిగి వెంటనే తేరుకొని) కారు సిద్ధంగా వుందండి.

కాని ఎక్కడికి తీసికెళ్ళాలో కనుక్కో మంటున్నాడండి డ్రైవర్.

చిత్ర: (కోపంతో) మా యిష్టంవచ్చిన చోటికి వెడతాం! అది అంతా ముందే డ్రైవరుకు చెప్పాలా? ఎవరాడ్రైవర్?

(చిత్ర, కిశోర్ చెయ్యా చెయ్యా పట్టుకొని కుడివైపు నిష్క్రమిస్తారు.—దండపాణి నోరు తెరుచుకొని-చలనంలేకుండా నిలబడి పోతాడు. జయరాం ఎడమవైపునుంచి వస్తాడు.)

జయ: (దండపాణి భుజంమీద చెయ్యివేసి) ఏమిటి అలాచూస్తున్నావు? కిశోర్ ఏడీ?

దండ: (వెనక్కి తిరిగి) ఆగనయ్యా! అమ్మాయిగారు మీ తుషార్‌గార్ని యెక్కడికో లాక్కుపోతన్నారు.

జయ: (నిస్పృహతో) హరి భగవాన్! వీడు మళ్ళీ అమ్మాయితో వెడుతున్నాడూ!! — ఎక్కడికి వెడుతున్నారో అడగలేకపోయావ్రా?

దండ: అడిగేనయ్యా బాబూ! అడిగేను!

జయ: అడిగితే ఏమన్నారు?

దండ: అబ్బాయిగారు బెల్లంకొట్టిన రాయిలా మాటామంతీ లేకుండా నిలబడిపోయారు. అమ్మాయిగారు మాత్రం మా యిష్టమొచ్చిన సోటికెళతాం పొమ్మన్నారు.

జయ: (నిస్పృహతో నిలువునా కుర్చీలో కూలబడి) హా! చచ్చి

తివిః! వీళ్ళిద్దరూ కలసి ఎక్కడికైనా పలాయనం చిత్తగిస్తున్నారేమో! (దండపాణిని కౌగలించుకొని) హా! దండపాణీ! అదేనిజమయితే వామనమూర్తిగారు నన్నూ నిన్నూ స్తంభానికి విరిచి కట్టేసారన్న మాటే!

దండ: (కోపంతో)ఆయనా నువ్వూ ఒకటిగనక నిన్ను యెలాగా కట్టేస్తారు. మధ్యని నన్ను ఎందుకు కడతారూ అంట!

జయ: వాళ్ళకు కారుతెచ్చి పెట్టినవాడు ఎవడూ అంట!

దండ: (పరిస్థితి తెలిసికొని) అమ్మబాబోయ్! కొంప మునిగిపోయింది. (విచారంతో) అయితే యిక మనకేందారి జై సీతారాం బాబూ!

జయ: మనయిద్దరికిదీ గోదావరివరకూ ఒకటే దారిరా నాయనా! (తనను తాను ప్రశంసించుకుంటూ) ఔరా! జయరాం! నీవు హరిశ్చంద్రుడికంటే గొప్పవాడవురా: హరిశ్చంద్రుడు కేవలం తన స్వార్థంకోసం తన సత్యవాక్య పరిపాలనకోసం అష్టకష్టాలు అనుభవించాడు. కాని నీవు ఒకమిత్రునికొరకు కష్టాలకు గురియైపోతివిగదా? నన్ను కని, పెంచి, నాపై ఎన్నో ఆశలుపెట్టుకున్న అమ్మా నన్నిక మరిచిపొమ్ము! పరోపకారముకొరకు యీ జయరాం వంశమంతరించెను గాక! హా! దండపాణీ!

దండ: (కోపంతో) వూరుకోవయ్యా! చెప్పుకోసిన మేకలా అలాగ అరుస్తావెందుకు?

(ఎడమవైపు నుంచి నిరంజన్, ఆనంద్ వస్తారు.)

నిరం: కిశోర్ కనిపించడేం?

జయ: (విచారంతో) యింకెక్కడి కిశోర్! ఎగిరిపోయాడు!

నిరం: } : (ఆశ్చర్యంతో) ఏమయ్యింది?
ఆనంద్

దండ: అమ్మాయిగారు అబ్బాయిగారు చెట్టాపట్టాలు వేసుకుని కారులో వెళ్ళిపోయారు.

నిరం: ఎక్కడికి?

జయ: అది తెలిస్తే యింక కావలసిందేముంది!

నిరం: (చిరాకుతో) క్షణాక్షణానికీ ఏవో ఆటంకం. యింక యిక్కడ మన ప్రయత్నాలు కొనసాగేలా కనిపించవు.

ఆనంద్: అసలు యీ స్థలం జయప్రదమైనదికాదు. మరోచోటికి ఎక్కడికైనా శీఘ్రమే కంపెనీ ఎత్తివెయ్యడం శ్రేయస్కరం.

నిరం: ఆ ఉద్దేశం వుంటే రాత్రిపూట మార్చడమే మంచిది. తక్షణం ఎవరి సామాన్లు వాళ్ళు సర్దుకోండి. యీ రాత్రికి ఏ సత్రంలోనో దిగుదాం పదండి.

(నిరంజన్, ఆనంద్, జయరాం దండపాణి ఎడమవైపు నిష్క్రమిస్తారు. కుడివైపునుంచి వామనమూర్తి వస్తాడు.)

వామ: (హాలులో తిరుగుతూ) చిత్రా! చిత్రా! (జవాబు లేక పోవడం చూసి కోపంతో బిగ్గరగా) దండపాణి! దండపాణి!

దండ: (ఎడమవైపు కనిపించి భయభక్తులతో) ఏం బాబూ?

వామ: పైకివెళ్ళి అమ్మాయిని పిలుచుకురా! (ఏం చెప్పడానికి మాటలు రాక గుటకవేస్తూ చూస్తాడు దండపాణి) అలా కళ్ళు తెరుచుకు చూస్తావేం? వినిపించడం లేదూ?

దండ: (భయంతో) అమ్మాయిగారు పైన లేరండీ!

వామ: ఎక్కడకు వెళ్ళింది?

దండ. కారులో ఎక్కడికో వెళ్ళేరండి.

వామ: ఓహో! అయితే యిప్పుడే వస్తుందిలే!

ఆ మాట ముందే చెప్పి తగులడకూడదూ?

దండ: ఒక్కరూ వెళ్ళలేదండి.

వామ: స్నేహితురాలెవరితోనైనా వెళ్ళిందా?

దండ: లేదండి. తుషార్ బాబుగారితో...

వామ: (ఆశ్చర్యంతో) కిశోర్‌తోనా! (కోపంతో) వాడు యిక్కడకు మళ్ళీ ఎందుకు వచ్చాడు?

దండ: నాటకం కంపెనీ వోరు బతిమాలి తీసుకొచ్చారండి.

వామ: అసలు యీ అనర్థాలన్నిటికీ నాటకం కంపెనీ కారణం. మేనేజరుగారికి బుద్ధిలేదు. యీ హాలు, వాళ్ళకు ఎందుకు

అడ్డెకివ్వాలి?

(అటూ యిటూ అశాంతితో తిరుగుతూ) యింతకూ వాళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్ళారురా?

దండ: (మరింత భయంతో) అదే తెలియకుండంలేదు బాబూ!

వామ: (ఒక్కసారి నిశ్చేష్టుడై ఏమిటి? ఎక్కడికి వెళ్ళారో తెలియదూ?——యిక వూరుకుంటే లాభంలేదు. వాడిని వెతికి పట్టుకొని జైలులో పెట్టిస్తాను.

(తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు వామనమూర్తి.)

దండ: (ఎడమవైపు చూస్తూ) బాబూ! జై సీతారాంబాబూ! కొంప మునిగింది.

జయ: (నేపథ్యంలోంచి) ఏం? ఏమయ్యింది ?

దండ: యింకేమవ్వాలయ్యా బాబూ! అంతా అయిపోయింది, బాబుగారికి తెలిసిపోయింది.

(ఎడమవైపు నిష్క్రమిస్తాడు దండపాణి. కుడివైపునుంచి కిశోర్, చిత్ర మాట్లాడుకుంటూ వస్తారు.)

కిశోర్: (కోపంతో) మీరేం చేసినా చెల్లుతుంది. మాలాంటి వాళ్ళం భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని నడుచుకోవాలి.

చిత్ర: తొందరపడకు కిశోర్. జాగ్రత్తగా ఆలోచించు.

కిశోర్: యిక ఆలోచించడానికేమీ లేదు.

చిత్ర: నామీద నీకు ప్రేమలేదా?

కిశోర్: ప్రేమ!! అది చాలా విచిత్రమైన పదం. దాని అర్థం తెలిసినవాళ్ళు యీ ప్రపంచంలో ఎంతమంది వున్నారో తెలియదు.

చిత్ర: నేను సీరియస్‌గా అడుగుతున్నాను. నువ్వు వేదాంతం లోకి దిగకు—మా నాన్నను ఒప్పించే పూచీ నాది.

కిశోర్: మిమ్మల్ని పెళ్ళిచేసుకునే అర్హత నాకెంతమాత్రంలేదు.

చిత్ర: ఆవేశాన్ని విడిచి ఆలోచించు! నాకు కావలసినంత ఆస్తి వుంది. నువ్వు కష్టపడవలసిన అవసరంలేదు. సుఖంగా జీవితం సాగించవచ్చు.

కిశోర్: మేం దరిద్రులమైనప్పటికీ మాకు సంస్కారం, నీతి వున్నాయి. ఒకరి సంపాదనమీద, ఒకరిధనంమీద ఆధార పడి జీవించేంతటి పనికిమాలినవాణ్ణికాను.

చిత్ర: నువ్వు చాలాతీవ్రంగా మాట్లాడుతున్నావ్ కిశోర్.

కిశోర్: వృథా వాగ్వాదం దేనికి? నన్ను విడిచిపెట్టండి.

చిత్ర: నువ్వుకనుపించకపోతే ఏంజరిగేదో తెలియదు. కాని నువ్వు కనిపించావు. నిజం చెబుతున్నాను కిశోర్. నిన్ను చూసినది మొదలు నా మనసు మనసులో లేదు. నీకోసం.........

కిశోర్: (కోపంతో మధ్యలో అందుకొని) నా కోసం మీ జీవితం ధారపోస్తానంటారు. అంతేకదూ? నా మాట వినండి. మీకు ప్రపంచంతో పరిచయం చాలదు. యీ ప్రపం

చంలో మనిషికీ మనిషికీ మధ్య దృఢమైన కంచుగోడలు వున్నాయి. వాటిని నిర్మూలించేవరకూ ఒక వర్గంలోనిమనిషి మరోవర్గంలోని మనిషి కేసి తేరిపారచూడలేడు. వృథాగా కష్టాలకు గురికావద్దు. మీ తండ్రి మన కలయికను తన జీవితంలో హర్షించడు. యిక గడచిపోయిన గాథను విస్మరించండి. మీ భవిష్యజ్జీవితాన్ని సుఖమయం చేసుకోండి. యిక నన్ను మరిచిపోండి. (ముందుకు నడుస్తాడు.)

చిత్రి: (బిగ్గరగా) కిశోర్! (కిశోర్ ఆగి ఎందుకన్నట్లుచూస్తాడు) నేను ఒకమాటడుగుతాను. కనీసం దానికి జవాబుచెప్పి వెళ్ళిపో. సంతోషిస్తాను. నా యీ ఒక కోరికా తీర్చు.

కిశోర్: (ఆమె కేసి జాలిగాచూస్తూ) ఏమిటది?

చిత్రి: (అతని కళ్ళలోకి చూస్తూ) నీకు నామీద అనురాగం వుందా?

కిశోర్: (బాధతో ముఖం పక్కకు తిప్పి) వుంది చిత్రా ... యిక గతాన్ని మరచిపో!

(కిశోర్ ముందుకు నడుస్తూవుంటాడు. ఎడమవైపునుంచి నిరంజన్, దినకర్, ఆనంద్, జయరాం, దండపాణి ఒకరువెనుక ఒకరు వరుసగా ప్రవేశిస్తారు. అందరిచేతులలోనూ సూట్ కేసులు వుంటాయి.)

నిరం: కిశోర్!

కిశోర్: (ఆగి) మీరంతా ఎక్కడికి బయలుదేరారు?

సిరం: యింకా ఒక నిశ్చయానికి రాలేదు. నువ్వు చెప్పకుండా పోతున్నావ్ ఎక్కడికి?

కిశోర్: నేనూ ఒక నిశ్చయానికి రాలేదు.

దండ: నేను నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసి నాటకం కంపెనీలో కలిసిపోయాను.

దినకర్: అధైర్యపడకండి. దట్టమైన నీలితెరలను తొలగించుకొని ముందుకు పదండి. తెల్లని శాంతిపురం చేరేవరకు విరామంలేకుండా నడవండి. రేపటి శాంతిపురంలో మీ ఆశలు, కోరికలు నెరవేరతాయి. మనిషికీ మనిషికీ మధ్య గల గోడలు మాయమౌతాయి.

(అందరూ కుడివైపు నిష్క్రమిస్తూవుంటారు. చిత్రి సజలనేత్రాలతో వాళ్ళకేసి చూస్తూ వుంటుంది — తెర.)

స మా ప్తం.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక " లో
13-2-57 నుండి 3-4-57 వరకూ
సీరియల్ గా ప్రచురించబడినది.

శ్రీ భారతీ ప్రింటింగు ప్రెస్, అలమూరు. తూర్పుగోదావరి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

## —చౌదరి ప్రచురణలు—

| | | |
|---|---|---|
| "కళోద్ధారకులు" (నాటికలు) | | |
| | శ్రీ ఆంగర సూర్యారావు | రు. 1—25 |
| "శ్రీమదాంధ్ర భగవద్గీత" (వచనం) | | |
| | శ్రీ [illegible] | 2—00 |
| "అంతరాత్మ" (కథలు) | | |
| | శ్రీ జరివాడ కాంతారావు | 1—00 |
| "పిల్లల కథాసాగరం" | | |
| | శ్రీ పురిగండా అప్పలస్వామి | 1—25 |
| "రాగమయి" (నవల) | | |
| | శ్రీ కాశీపట్నపు రామారావు | 1—00 |
| "కామాక్షి" (నవల) | | |
| | శ్రీ ఓగేటి శివరామకృష్ణ | 2—50 |
| "నాట్యసుందరి" | | |
| | శ్రీ [illegible] రామకృష్ణ | 1—50 |
| "నీలితెరలు" (నాటకం) | | |
| | శ్రీ ఆంగర సూర్యారావు | 1—50 |




**NEELITERALU**

BY

**A. SURYA RAO**

*Rs.* **1-50**

Tittle Printed at Satyavati Press, Rajahmundry.